

# అపకారికి ఉపకారం

విశాలబేశాన్నేలే కీర్తిసేనుడికి, ఒక్కగా నొక్క కుమార్తె. ఆమె పేరు ప్రియంవద. ఆమె గొప్ప సౌందర్యవతే కాక, గురువుల ద్వారా, రాజకుమార్తెకు అవసరం అయిన అన్ని విద్యలూ నేర్చుకున్నది. అయితే, ఆమె పుట్టగానే జాతకం చూసిన ఆస్థాన జ్యోతిష్కుడు, రాజూ, రాణీలకు ప్రియంవద భవిష్యత్తును గురించిన కొన్ని వింత విషయాలు చెప్పాడు.

ప్రియంవదకు పాముకాటు ప్రమాదం వున్నది; ఆమె ఒక సామాన్యుణ్ణి వివాహం ఆడుతుంది.

తమ ఆస్థాన జ్యోతిష్కుడు, జ్యోతి శ్శాస్త్రంలో నిధి అన్న నమ్మకం, కీర్తి సేనుడికీ, రాణీకీ వున్నది. తమ కుమార్తెను రానున్న ప్రమాదాల నుంచి కాపాడుకునేందుకు వాళ్ళొక పథకం వేశారు. అదేమంటే—ప్రియంవద, ఏ రాజకుమారుణ్ణో వివాహం ఆడేవరకూ, ఆమె తనకు విద్య నేర్పే గురువులనూ, దాసీలనూ తప్ప, మరే పురుషుణ్ణీ చూడకుండా గట్టి కట్టుదిట్టం చేయడం.

ప్రియంవద పెంపకం, తల్లిదండ్రులు ఆశించిన విధంగానే సాగి, పదహారు సంవత్సరాలు నిండినై. అప్పటి నుంచీ కీర్తిసేనుడు తీవ్రంగా వరాన్వేషణ ప్రారంభించాడు. అన్ని విద్యలలోనూ సాటి లేని మేటి రాజకుమారుడిని వెతికి, తన అల్లుడుగా చేసుకోవాలని, ఆయన ఆశ పడుతున్నాడు.

ఇలా వుండగా—ఒక పౌర్ణమినాటి రాత్రి, ప్రియంవద చెలికత్తెలు ఎవరూ వెంట లేకుండా, ఒంటరిగా ఉద్యాన వనంలో విహరిస్తున్నది. అప్పుడు, ఎక్కడి నుంచో ఒక నల్లని నాగుపాము వచ్చి, ఆమె ముందు పడగవిప్పి ఆడసాగింది.

"వసుంధర"



ప్రియంవద పామును గమనించలేదు. ఆమె సంపెంగపూలను వాసన చూస్తూ పరవశించిపోయి, కొద్దిసేపటి తర్వాత, ఒక పూవును ముక్కుకానించుకుని అలా విసిరింది.

ప్రియంవద విసిరిన పువ్వు, పడగవిప్పి ఆడుతున్న నాగుపాము పడగకు తగిలింది. పాము వెంటనే బుస్సుమన్నది. ఆ శబ్దం వింటూనే ఆమె ఉలిక్కిపడి, అటు చూసింది. ఎదురుగా నాగుపాము!

ప్రియంవద భయకంపితురాలై పోయింది. నాగుపాము ఒక్కక్షణం పడగ పైకెత్తి, ఆమె కేసి చూసి, జర్రున ముందుకు వచ్చింది. ఆమె పారిపోవాలనుకున్నది కాని, కాళ్ళను కదిలించలేక పోయింది. ఆమె భీతితో కెవ్వుమంటూ అరిచింది.

ఆ మరుక్షణం, భటుడొకడు పరిగెత్తుకుంటూ అక్కడికొచ్చి, నాగుపాము తోక పట్టుకుని, గిరిగిర తిప్పి, నేల కేసి ఒకసారి బలంగా మోది, దూరంగా పారవేశాడు.

ప్రియంవద వెంటనే తేరుకుని, భటుడి కేసి చూసింది. వాడు యువకుడు, మంచి అందగాడు. ఆమె అలాంటి రూపవంతుణ్ణి ఇంతవరకూ చూసి వుండలేదు. పైగా, తను భయంతో కేక వెయ్యగానే, అతడక్కడికి ఎలా వచ్చాడో, ఆమెకు అర్థం కాలేదు.

ప్రియంవద, భటుణ్ణి, ''ఎవరు నువ్వు?'' అని అడిగింది.

''నేను, తమ సేవకుణ్ణి. ఉద్యానవన కాపలా భటుణ్ణి, రాజకుమారీ!'' అని జవాబిచ్చాడు వాడు.

రాజకుమారి తనను చూడకపోయినా, కాపలా భటుడుగా, వాడు రాజకుమారిని దూరంగా వుండి చాలాసార్లు చూసి వున్నాడు.

''సమయానికి వచ్చి, నా ప్రాణం కాపాడావు. నీకేం కావాలో కోరుకో,'' అన్నది ప్రియంవద.



''నాకే కోరికలూ లేవు,'' అన్నాడు భటుడు.

''ఈ ప్రపంచంలో, కోరిక లుండని వారుండరు. సందేహించకుండా, నీ మనసులో ఎటువంటి కోరిక వున్నాసరే, చెప్పు!'' అన్నది ప్రియంవద.

''మనిషికి స్వర్గం చూడాలని వుంటుంది; దేవుణ్ణి చూడాలని వుంటుంది. ఇలాంటి కోరికలెవరైనా తీర్చగలరా ?'' అని అడిగాడు భటుడు.

''నేను తీర్చగల కోరికలేమీ, నీకు లేవా ?'' అన్నది ప్రియంవద.

''తమరు, నా కోర్కెను తీర్చగలరు; కానీ తీర్చరు. ఒకవేళ, తమరు నా కోర్కెను తీర్చుతానన్నా, నేనంగీకరించను,'' అన్నాడు భటుడు.

''ఏమిటి, నీ కోరిక ?'' అన్నది ప్రియంవద, భటుడి మాటలకు ఎంతో ఆశ్చర్యపోతూ.

''రాకుమారీ! నేను, తమను ప్రేమిస్తున్నాను. కాని, మన పెళ్ళి అసాధ్యం. ఎందువల్లనంటే, నేను తమను ప్రేమిస్తున్నట్టు తెలిస్తే, ప్రభువులు, నా తల తీయించేస్తారు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను; నా ప్రాణాన్ని ప్రేమిస్తున్నాను. బతికుంటే రోజూ మిమ్మల్ని చూస్తూండవచ్చు,'' అన్నాడు భటుడు.

ఆ మాటలకు ప్రియంవద తెల్లబోయింది. భటుడు నిజమే చెప్పాడు! వాడిని పెళ్ళాడడం, తను సులభంగా తీర్చగల కోరికే—కాని, ఆ కోరిక తను తీర్చలేదు. ఈ విషయం తెలిస్తే, తన తండ్రి కోపగించుకోవడమే గాక, భటుడి తల తీయించినా, తీయించవచ్చు! అయితే, తను ఇప్పుడేం చేయాలి? ప్రాణాలకు తెగించి తనను పాముకాటు నుంచి రక్షించిన భటుడి కోరిక కూడా తీర్చలేకపోతే, తను రాజకుమారి అయుండీ ఏం ప్రయోజనం?

ప్రియంవద దిగులుగా, ''ఇంతకాలం, నేను చాలా గొప్పదాన్ననుకున్నాను.



ఉపకారికి ఉపకారం కూడా చేయలేని, అసహాయురాలినని, యిప్పుడే తెలిసింది. నన్ను క్షమించు !'' అన్నది.

''క్షమించడానికి, నేను తమకు చేసిన ఉపకారం ఏమిటి ? నేను తమ సేవకుణ్ణి. తమను రక్షించుకోవడం, నా బాధ్యత. నా మీద అభిమానం వుంటే, అదే చాలు, రాకుమారీ !'' అన్నాడు భటుడు.

ప్రియంవద ఉద్యానవనం నుంచి, పుట్టెడు దిగులుతో అంతఃపురానికి వెళ్లింది. ఆ సమయంలో కీర్తిసేనుడు, తన భార్య కాంతిమతితో మాట్లాడుతున్నాడు. రాజూ, రాణీ కూడా ప్రియంవద రాకను గమనించ లేదు. వాళ్ళిద్దరూ తనను గురించే మాట్లాడుకుంటున్నారని గ్రహించి, ప్రియంవద అక్కడ వున్న ఒక తెర చాటుకు తప్పుకున్నది.

''నాకు, ప్రియంవద వివాహం గురించి బెంగగా వున్నది,'' అన్నాడు రాజు.

''అవును, నాకూ ఏం చెయ్యాలో తోచడం లేదు. జాతకం ప్రకారం, ప్రియంవద ఏ రాజకుమారుణ్ణో కాక, సామాన్యుణ్ణి వివాహమాడవలసి వున్నది గదా ! మన ఆస్థానజ్యోతిష్కుడి మాట, ఇంతవరకూ ఏనాడూ తప్పకాలేదు,'' అన్నది రాణి.

తల్లిదండ్రుల మాటలు విన్న ప్రియంవదకు, ఒక విషయం అర్థమైంది. తను పుట్టగానే జాతకం చూసి, ఆస్థాన జ్యోతిష్కుడు, తను సామాన్యుణ్ణి వివాహం ఆడుతుందని చెప్పాడు. తల్లిదండ్రులకు యిది యిష్టం లేదు !

ఇప్పుడు తనకు పెళ్ళీడు వచ్చింది. ఉద్యానవనంలో, సామాన్యుడైన ఒక భటుడు తన ప్రాణాలు రక్షించి, తనను పెళ్ళాడాలన్న కోరిక వెలిబుచ్చాడు. అంటే—జాతకం ప్రకారమే అంతా జరుగుతున్నదా ?

ప్రియంవద, ఆ రోజంతా బాగా ఆలోచించింది. సామాన్యుడిని వివాహం చేసుకోవాలని తన జాతకంలో రాసి వున్నప్పుడు—అది నిజం కాక తప్పనప్పుడు—తనకు

ఉపకారం చేసిన భటుణ్ణి పెళ్ళి చేసుకో వడంలో తప్పేముంది ?

ఆలోచించిన కొద్దీ ప్రియంవదకు, ఆ భటుణ్ణే వివాహం చేసుకోవాలనిపించింది. అయితే, యీ సంగతి తల్లిదండ్రులతో చెప్పడం ఎలా ?

ఆమె, ఇలా ఆలోచిస్తూండగా, అంతఃపురానికి, ఆస్థాన జ్యోతిష్కుడు వచ్చాడు. కీర్తిసేనుడూ, కాంతిమతీ, ఆయనతో రహస్యంగా మంతనాలు ప్రారంభించారు. వాళ్ళ మాటలు విన్న ప్రియంవద భయంతో నిలువునా వణికి పోయింది.

ఆ ముగ్గురూ కలిసివేస్తున్న పథకం ఏమంటే—ఎక్కడినుంచో, ఒక సామాన్య వ్యక్తిని పట్టుకువచ్చి, రహస్యంగా అతడితో, ప్రియంవద పెళ్ళి జరపడం. తర్వాత, ఆ వ్యక్తిని, ఏ విషప్రయోగం ద్వారానో తుదముట్టించడం! ఈ విధంగా చేస్తే, ఆ తర్వాత ప్రియంవద, ఏ గొప్ప రాజకుమారుణ్ణో వివాహం ఆడవచ్చు.

ఇప్పుడు ప్రియంవదకు, ఒక విషయం స్పష్టంగా అర్థమైంది. తను, ఉద్యాన కావలాభటుణ్ణి, వివాహం చేసుకుంటా నంటే, తన తల్లిదండ్రులు సంతోషంగా ఒప్పుకుంటారు. అది ముగియగానే, అతణ్ణి చంపేస్తారు. ఇంతకన్నా ఘోరం వుండదు!

ప్రియంవద, సాయంత్రం ఒంటరిగా ఉద్యానవనానికి వెళ్ళి, భటుణ్ణి పిలిచి, "నిన్న, నీ పేరు అడగడం మరిచాను. ఇప్పుడు చెప్పు. నీ పేరేమిటి?" అని అడిగింది.

"నా పేరు, జయుడు," అన్నాడు భటుడు.

ఆ వెంటనే ప్రియంవద, "జయా, మనం పెళ్ళి చేసుకుందాం," అన్నది.

"రాకుమారి, అంతసాహసం నేను చేయలేను. నాకు భయం," అన్నాడు జయుడు.

"ఎలాంటి ప్రమాదం జరక్కుండా, ఒక ఉపాయం చెబుతాను," అన్నది ప్రియంవద. —(ఇంకాఉంది)





# అపకారికి ఉపకారం

## 2

ప్రియంవద తమ పెళ్లి విషయమై, ఏదో ఉపాయం చెబుతాననగానే, జయుడు, ఒక క్షణం మౌనంగా వూరుకుని, తర్వాత భయంగా, ''ఏమిటది?'' అని అడిగాడు.

''జాగ్రత్తగా విను. అంతఃపురంలో నుంచి బయటపడడానికి, ఒక రహస్య సొరంగమార్గం వున్నది. నేను ఆ మార్గాన బయటికి వెళ్ళిపోతాను. నగరంలో, నీ ఇంటి వివరాలు చెప్పు. మారువేషంలో, అక్కడికి వస్తాను.'' అన్నది ప్రియంవద.

''మీరు అంతఃపురంలో లేరని తెలియగానే, ఎంత కల్లోలం బయలుదేరుతుందో, ఆలోచించారా?'' అని అడిగాడు జయుడు.

''ఆ మాత్రం నాకు తెలియకపోలేదు. ఈలోగా, నువ్వు చేయవలసినదేమంటే, ఉద్యానవనంలోకి, ఒక మాంత్రికుడొచ్చి. రాకుమారిని ఎత్తుకుపోయాడని గొడవ చేయడం. అప్పుడు, మా నాన్న ఒక ప్రకటన చేస్తాడు. మాంత్రికుడి బారినుంచి ఎవరు నన్ను రక్షిస్తే, వారికి నన్నిచ్చి వివాహం చేస్తానని. కొన్నాళ్ళాగి నువ్వు, నన్ను మా నాన్న దగ్గిరకు తీసుకుపోయి, మాంత్రికుణ్ణి చంపేశానని చెప్పు. నువ్వు చెప్పినవన్నీ, నిజమేనని నేనూ చెబుతాను. అప్పుడు, నీకు మహావీరుడన్న కీర్తి వస్తుంది. మన వివాహం జరుగుతుంది. ఎవరికీ ప్రమాదముండదు, "అన్నది ప్రియంవద.

జయుడికి, ఈ ఉపాయం నచ్చింది. వాడు, ప్రియంవదతో, ''నువ్వెలా చెబితే, అలా చేస్తాను, రాజకుమారీ !'' అన్నాడు.

జయుడి జవాబుకు తృప్తిపడి, ప్రియంవద అంతఃపురానికి తిరిగి వచ్చింది.



అ సొరంగానికి, మొత్తం మూడు ప్రవేశమార్గాలున్నవి. ఒకటి, రాజు మంత్రాంగమందిరంలోనూ, మరొకటి, రాణి శయనాగారంలోనూ, వేరొకటి రాజకుమారి శయనమందిరంలోనూ వున్నవి. రాజకుమారి నిద్రించే హంసతూలికా తల్పం కింద వున్న రాతిపలకను తొలగించితే, దిగువకు మెట్లుంటవి. లోనికి దిగి, తిరిగి రాతిపలకను ఎప్పటిలా అమర్చవచ్చు.

ప్రియంవద, ఆ విధంగా చేసి, సొరంగ మార్గాన కొద్ది దూరం నడిచింది. అంతా కటికచీకటి. కొద్దిసేపటికి ఆమె కళ్ళు, ఆ చీకటికి అలవాటుపడినై. ఆమె ముందుకు నడవసాగింది. అలా ఎంత దూరం నడిచినా, దాని అంతు కనిపించడం లేదు. సొరంగం చివరికిపోయి, దాని వివరాలు జయుడితో చెప్పాలనుకున్నదామె. కాని, ఇప్పుడది సాధ్యంగా తోచలేదు.

త్వరగా సొరంగం చివరిభాగం చూడాలన్న ఆత్రం కొద్దీ, ప్రియంవద పరిగెత్తడం ప్రారంభించింది. అలా కొంత దూరం పరిగెత్తేసరికి ఆమెకు ఆయాసం వచ్చింది ఇక, ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేక, ఉన్నచోటునే కూర్చున్నది. అసలే, బాగా అర్ధరాత్రివేళ బయలుదేరిందేమో, ఆమెకు నిద్రముంచుకురాసాగింది.

ఆమె తన పథకాన్ని అమలు చేయడం గురించి చాలా దీర్ఘంగా ఆలోచించింది. ముందు ఆమె, అంతఃపురంలోని రహస్య సొరంగానికి సంబంధించిన పూర్తివివరాలు రాబట్టాలనుకున్నది. కాని, ఇందుకు ఎవరినడగాలి? తల్లి నడిగితే, ఆమె అనుమానించవచ్చు.

ప్రియంవదకు, ఆ సొరంగ మార్గం ఎక్కడ వున్నదీ, అందులోకి ఎలా ప్రవేశించాలన్నంతవరకు తెలుసు. అయితే, అదెక్కడికి దారి తీస్తుందో మాత్రం, ఆమెకు తెలియదు. ఆ సంగతి తెలుసుకునేందు కామె, ఆనాటి అర్ధరాత్రివేళ సొరంగంలో ప్రవేశించింది.

దానికితోడు విపరీతమైన అలసట. అందువల్ల, ప్రియంవద, ఆ సొరంగమార్గంలోనే ఒళ్ళు తెలియకుండా నిద్రపోయింది.

అలా ఎంత సేపు నిద్రపోయిందో, ఆమెకు తెలియదు. హఠాత్తుగా మెలుకువ వచ్చి, ప్రియంవద ఉలిక్కిపడి లేచి కూర్చున్నది. చుట్టూ చీకటి. ఆమెకు వెంటనే తను సొరంగమార్గంలో వున్నట్టు గుర్తురాలేదు. ఆ సంగతి గుర్తుకురాగానే, లేచి నిలబడింది. అయితే, కటిక నేల మీద నిద్రపోవడంవల్ల, ఆమెకు ఒళ్ళంతా నొప్పులుగా వున్నది. ఆమెకు ఆశ్చర్యం కలిగింది! పడుకున్నది కటిక నేల కావడం వల్ల, తనకు ఒళ్ళంతా నొప్పులుగా వున్నా, ఏనాడూ పట్టుపరుపుల మీద కూడా యింత హాయిగా నిద్రపట్టలేదు!

సొరంగమార్గాన తను యింతదూరం వచ్చిన తర్వాత, యిప్పుడేం చేయడమా అన్న సమస్య, ప్రియంవదకు, ఎదురయ్యింది. ఇప్పుడు తిరిగి వెనక్కు వెళ్ళడంవల్ల ప్రయోజనం వుండదు. ఇప్పటికే తను కనబడడం లేదన్న సంగతి, అంతఃపురంలో గగ్గోలు కలిగించి వుంటుంది. జయుడు తను చెప్పిన ప్రకారం తప్పక చేస్తాడు. అందువల్ల, ధైర్యంగా ముందుకుపోవడమే మంచిదనుకున్నది, ప్రియంవద.



ఆమె పట్టుదలగా ముందుకు నడవసాగింది. అయితే, కాలం గడుస్తున్నా, సొరంగమార్గం చివర దగ్గిరపడడం లేదు. హఠాత్తుగా ఆమెకు ఒకసారి, తన తండ్రి, తల్లితో అన్నమాటలు గుర్తుకువచ్చినై. సొరంగమార్గాన పోదలచినప్పుడు, కొన్ని ఆహారపదార్థాలు వెంట తీసుకువెళ్ళడం అవసరం. ప్రయాణం సుమారు రెండు రోజులు పడుతుంది!

ఈ సంగతి గుర్తురాగానే, ప్రియంవదకు దుఃఖం వచ్చింది. తను రెండు రోజుల ప్రయాణానికి సరిపడా, ఆహారపదార్థాలు వెంట తీసుకురావలసింది! ఇప్పుడు, తిండి లేకుండా, అంత దూరం ప్రయాణం

చేయగలదా? ఏది ఏమైనా, రోట్లో తల దూర్చి రోకటి పోటుకు వెరచి ప్రయోజనం వుండదు. ఉపకారికి ఉపకారం చేయడం కోసం, తన తల్లిదండ్రుల దుష్టపథకాన్ని తారుమారు చేయడం కోసం—తను ఎన్ని కష్టాలకైనా ఓర్చుకోవాలి. అనుకున్నదాన్ని సాధించి తీరాలి!

ప్రియంవద అలాగే అన్నపానాలు లేకుండా, కటిక మార్గంలో పాదాలు నొచ్చుతున్నా భరించి—సొరంగమార్గం చివరకు చేరుకున్నది. మార్గం ఒక మహా వృక్షం మొదలు లోనికి దారి తీసినట్టు, ఆమె గ్రహించింది. అక్కడ భూమిలోనికి పాతుకుపోయిన లావుపాటి చెట్టువేళ్ళు, ఆమెకు కనిపించినై. చెట్టుబోదె లోపలికి సన్నని దారి వున్నది. ప్రియంవద సందేహించకుండా, అందులో ప్రవేశించింది. అక్కడ పైకి వెళ్ళేందుకు మెట్లున్నవి. ఆమె, ఆ మెట్లెక్కింది.

మళ్ళీ చీకటి. కాని, ఒక పక్కనుంచి సన్నని వెలుతురు వస్తున్నది. ప్రియంవద, ఆ వెలుతురును జాగ్రత్తగా గమనించి, అక్కడ చేయి పెట్టి తడిమింది. చేతికి తలుపు గడియలాటిది తగిలింది. దానిని పక్కకు లాగగానే, తలుపు తెరుచుకుని, రయ్యిమంటూ చల్లనిగాలి, ఆమె ముఖాన్ని తాకింది.

ప్రియంవదకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆమె చుట్టుపక్కల ఏమున్నదన్న ఆలోచన లేకుండా, అవతలికి దిగింది.



ఆ మరుక్షణం, "దేవత ప్రత్యక్షమైంది! దేవత ప్రత్యక్షమైంది!" అన్న పెద్ద కేకలు, ఆమెకు వినిపించినై.

ప్రియంవద ఒక క్షణం నివ్వెరపోయి, అలా కేకలు పెడుతున్నవాళ్ళెవరో తెలుసుకునేందుకు తల తిప్పబోయింది. కాని, ఆ క్షణంలోనే ఆమెకు స్పృహతప్పింది.

ప్రియంవద, యీ విధంగా స్పృహ కోల్పోయిన ప్రదేశానికి కొంత దూరంలో, శతనందన అనే గ్రామం వున్నది. ఆ గ్రామంలోని ప్రజలందరూ మూర్ఖులు. వాళ్ళ మూర్ఖత్వాన్ని ఆధారంగా చేసుకుని, గ్రామాన్ని యిద్దరు పెద్దలు ఏలుతున్నారు. ఆ గ్రామ ప్రజలకు, వాళ్ళేది చెబితే అది పరమసత్యం. వాళ్ళను అందరూ దేవతా స్వరూపులుగా భావిస్తారు. పండుగల్లో, అందరూ వాళ్ళకు కానుకలు సమర్పిస్తారు.

గ్రామంలో ఎవరికే కష్టం వచ్చినా, ప్రజలుముందుగా, ఆ పెద్దలకు చెప్పుకుంటారు. వానలు పడకపోయినా, ఎవరికైనా జబ్బు చేసినా—ఆ పెద్దలకు సవినయంగా మనవి చేయవలసిందే! వాళ్ళకు తెలియకుండా, ఎవరిళ్ళలోనూ, ఏ శుభ కార్యమూ జరగకూడదు.

శతనందన గ్రామ ప్రజల మూర్ఖత్వం ఎలా వుంటుందంటే—ఒకసారి శంకరయ్య అనేవాడి ఇంటికి నిప్పంటుకున్నది. అప్పుడు, ఇంట్లో వాళ్ళందరూ బయటికి వచ్చేశారు. మంటలార్పేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. శంకరయ్య, ఏం



చేయాలని అడిగేందుకు పెద్దల ఇంటికి పరుగుతీశాడు.

ఆ సమయంలో పెద్ద లిద్దరూ మంచి గాఢనిద్రలో వున్నారు. శంకరయ్యకు వాళ్ళను నిద్ర లేపేందుకు కొంతసేపు పట్టింది. వాళ్ళు నిద్ర లేచి, విషయం తెలుసుకుని, వెంటనే నీళ్ళతో మంట లార్పమని ఆదేశించారు. ఇందువల్ల, పక్క ఇళ్ళకు అగ్నిప్రమాదం తప్పింది కాని, శంకరయ్య ఇల్లు మాత్రం పూర్తిగా కాలిపోయింది.

అప్పుడు పెద్దలు, శంకరయ్యతో, "నువ్వేదో పాపం చేశావు. ఆ పాపమే అగ్నిరూపంలో వచ్చి, నీ కొంప తగుల బెట్టింది. అయితే, నువ్వు మమ్మల్ని నమ్మావు. అందువల్ల, కొంపతోపాటు మనుషులు కూడా తగలబడకుండా కాపాడబడ్డారు. కొంప తగలబడితే, మళ్ళీ కట్టుకోవచ్చు; మనుషుల ప్రాణాలు పోతే మళ్ళీ రావు. అలాంటి వాటినే, మేము రక్షిస్తూంటాము," అని చెప్పారు.

శంకరయ్య వాళ్ళకు పడిపడి దణ్ణాలు పెట్టి వెళ్ళాడు.

ఆ గ్రామంలో, భీమయ్య అనే వాడి కొడుక్కు జబ్బు చేసింది. భీమయ్య, తన కొడుకును పెద్దలకు చూపించాడు. వాళ్లకు ఏదో కొద్దిపాటి వైద్యం తెలుసు. ఆ వైద్యంతో, అదృష్టమున్నవాళ్ళు బతుకుతారు; లేనివాళ్ళు పోతారు. భీమయ్య కొడుకు చచ్చిపోయాడు. అప్పుడు పెద్దలు, భీమయ్యతో, "నువ్వు పాపాలు చేశావు. ఆ పాపాలే మృత్యువు రూపంలో వచ్చి, నీ కొడుకును తీసుకుపోయాయి. ప్రపంచంలో, ఏ వైద్యుడూ నీ కొడుకును బతికించ గలిగి వుండేవాడు కాదు. వాడు, మా చేతుల్లో పోయాడు కాబట్టి, యిప్పుడు సరాసరి స్వర్గానికే వెళ్ళి పోయాడు. మరొక వైద్యుడి చేతిలో అయితే, మీ వాడు నరకానికిపోయేవాడు," అని చెప్పారు. కొడుకు తనకు దక్కకపోయినా, కనీసం వాడు స్వర్గానికి వెళ్ళాడని, భీమయ్య ఎంతగానో సంతోషించాడు. —(ఇంకా ఉంది)





# అపకారికి ఉపకారం

**3**

పెద్దమనుషులుగా నటిస్తూ, దుర్మార్గ కార్యాలు చేసేవాళ్ళలో, రెండు రకాలుంటారు. మొదటిరకం వాళ్ళు తెలివైన వాళ్ళు. వాళ్ళు ప్రజలకు మాయమాటలు చెబుతారు. ప్రజలకు ఏ మేలు జరిగినా, తమవల్లనే అంటూ, ఆ ప్రజల కష్టం మీదే బతుకుతారు.

రెండోరకం దుర్మార్గులు తెలివి తక్కువవాళ్లు. వాళ్లు ప్రజలను బాధించి ఆనందిస్తారు. తెలివైన దుర్మార్గులకు, ప్రజలవల్ల ఎన్నటికీ ప్రమాదం వుండదు. ప్రజల్లో కూడా తెలివితేటలు వస్తేనే, వాళ్ళకు ప్రమాదం. ఇకపోతే, తెలివి తక్కువ దుర్మార్గులకు ప్రజలవల్ల ప్రమాదం తప్పదు. ప్రజలు ఎంతో కాలం వాళ్ళను భరించలేరు, ఏదో ఒకనాడు తిరగబడతారు.

ఇలాంటి పరిస్థితే, శతనందన గ్రామంలో తల ఎత్తింది. గ్రామ పెద్ద లిద్దరూ తెలివైన దుర్మార్గులే కాని, వాళ్ళకు తెలివి తక్కువ దుర్మార్గులైన కొడుకులు పుట్టారు! వాళ్ళు గ్రామంలో, మూర్ఖులైన ప్రజలు తమ తండ్రుల కిచ్చే గౌరవ మర్యాదలను అసరాగా చేసుకుని, చిన్నప్పటి నుంచీ విపరీతంగా అల్లరి చిల్లరపనులు చేయసాగారు.

వాళ్ళిద్దరూ ఒక్కటే ప్రాణం అన్నట్టుగా వుండేవాళ్ళు. ఎవళ్ళ తోటలోకో వెళ్ళి, మామిడికాయలు దొంగిలించడం, ఎవరింటికో వెళ్ళి, గాజుసామానులు బద్దలు కొట్టడం, ఇతరుల పిల్లలను అకారణంగా హింసించడం—ఇలాంటి దుర్మార్గ కార్యాలు చేస్తూండేవాళ్ళు.

"వసుంధర"

ఈ విషయం విన్న పెద్దలిద్దరూ, కొడుకులతో, "మీరు, ఇతర్ల తోటలలోకి వెళ్ళి కాయలూ, పళ్ళూ కోయడమే కాదు, ఇళ్ళకు వెళ్ళి పాలూ, వెన్నా కూడా దొంగిలిస్తూండండి. అప్పుడు, మా పని మరింత సులభమవుతుంది!" అన్నారు.

కొడుకులకు, ఈ సలహా నచ్చింది. వాళ్ళు అలాగే చేయసాగారు. కొన్నాళ్ళిలా జరిగేసరికి, గ్రామ ప్రజలు యిక భరించలేక, పెద్దల ఇళ్ళకు పోయి, తమ కష్టాల గురించి చెప్పుకున్నారు.



పెద్దలు ముందు వాళ్ళను శాంతపరిచి, తర్వాత నెమ్మదిగా, "మా పిల్లలలో శ్రీకృష్ణుడి అంశవున్నది. అందువల్లనే, వాళ్ళలా అల్లరి చేస్తున్నారు. ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు అల్లరి చేస్తూంటే, గోపికలు వెళ్ళి యశోదతో చెప్పుకుంటూండే వాళ్ళు. కాని, వాస్తవమేమంటే, అందరికీ శ్రీకృష్ణుడంటే యిష్టమే! మీకు భాగవత గాథ తెలియక బాధపడుతున్నారు. ఈ రోజు నుంచీ, మీరందరూ సాయంత్రాలు, మా ఇళ్ళకు వచ్చి భాగవత పురాణగాథలు, వినండి," అని చెప్పారు.

ఆ రోజు నుంచీ గ్రామస్థులకు, గ్రామ పెద్దల పిల్లల బెడద తప్పకపోయినా, రోజూ సాయంత్రాలు, గ్రామ పెద్దలు చెప్పే పురాణకథలు వినవలసి వచ్చింది.

అయితే, ఈ పరిస్థితి ఎంతో కాలం కొనసాగలేదు. భాగవతం వింటూంటే, ప్రజలకు రకరకాల అనుమానాలు కలగసాగాయి.

శ్రీకృష్ణుడు చిన్నతనంలో, అల్లరి పనులు చాలా చేశాడు. దొంగతనాలు చేశాడు. అయితే, ఎన్నో మాయలూ చేశాడు. తన వాళ్లు కష్టాల్లో వున్నప్పుడల్లా, వాళ్లను కాపాడుతూ వచ్చాడు. కాళీయుణ్ణి చంపాడు; గోవర్ధనపర్వతం ఎత్తాడు. గ్రామ పెద్దల పిల్లలు మాత్రం చెడ్డపనులే చేస్తున్నారు. సంతోషాన్ని కలిగించడం లేదు!

చాలామంది గ్రామస్థులు, తమ సందేహాలను పెద్దలకే చెప్పుకున్నారు. అప్పుడు పెద్దలిద్దరూ ఆలోచనలో పడ్డారు.



''మీరడిగినది, న్యాయంగానే వున్నది. ఒక రాత్రంతా తపస్సుచేసి, ఇందులోని రహస్యం తెలుసుకుని, మీకు చెబుతాం,'' అని పెద్దపెద్ద, వాళ్ళకు చెప్పిపంపేశాడు.

వాళ్ళు వెళ్ళిపోయాక చిన్నపెద్ద, పెద్దపెద్దతో, ''మనమిప్పుడేం చేయాలి? మన పిల్లల కారణంగా, మన అధికారం దెబ్బతినేలా వున్నది. వాళ్ళకేదో విధంగా, మంచిగా వుండమని గట్టిగా బుద్ధి చెబితే గాని, గ్రామస్థులూరుకోరు,'' అన్నాడు.

పెద్దపెద్ద కాసేపాలోచించి, ''మన పిల్లలు, మన మాట వినరు. వాళ్ళు వింటామన్నా, వాళ్ళ మనసు కష్టపెట్టడం, మన కిష్టముండదు. అసలీ ప్రమాదమంతా, గ్రామస్థులకు పురాణం వినిపించడంవల్ల వచ్చింది. పురాణకథలు చెప్పడం ద్వారా, ప్రజలను మరింత మూర్ఖుల్ని చేసి, చెడ్డతనాన్ని సహించే అలవాటు చేయవచ్చనుకున్నాను. కాని, పురాణాలు వింటే, ప్రజల్లో తెలివితేటలు పెరుగుతున్నవి. వాళ్ళకు, చెడ్డను ఎదిరించే ధైర్యం వస్తున్నది. అందువల్ల, మనం ముందు గ్రామస్థులకు పురాణాలు వినిపించడం మానివేయాలి,'' అన్నాడు.

''అది సరే, ముందు మన పిల్లల్ని అదుపుచేయడం ఎలా?'' అని అడిగాడు చిన్నపెద్ద.

ఇద్దరూ, ఆ రాత్రంతా ఆలోచించారు. చివరకు, వాళ్ళకు ఒక మంచి ఉపాయమే తట్టింది. మర్నాడు గ్రామస్థులు పురాణం వినడానికి వచ్చినప్పుడు, పెద్దపెద్ద, వాళ్ళకు జయవిజయులకథ చెప్పాడు:

జయుడు, విజయుడు వైకుంఠంలో, శ్రీ మహావిష్ణువుకు ద్వారపాలకులు. ఒకసారి, సనకుడు, సనందనుడు మొదలైన మునులు, విష్ణుమూర్తి దర్శనానికి వెళితే, వాళ్ళిద్దరూ ద్వారం దగ్గిర వుండి, ''ఇది సమయం కాదు; కాసేపాగండి!'' అని వాళ్ళను ఆపారు.

తమను అలా ఆపినందుకు మునులు కోపించి, జయవిజయులను రాక్షసులు

కండని శపించారు. ఇది తెలిసి విష్ణుమూర్తి, జయవిజయులను పిలిచి, "ఇందులో, మీ తప్పేమీ లేదు. మునిశాపం అమోఘంకాబట్టి, మీరు రాక్షసజన్మ ఎత్తక తప్పదు. అయితే, మీకొక అవకాశం యిస్తున్నాను! మంచి పనులు చేసి పుణ్యాత్ములనిపించుకుంటూ, ఏడు జన్మలెత్తి, ఆ తర్వాత నన్ను చేరుకుంటారా? లేక దుర్మార్గులుగా మూడు జన్మలెత్తి, నన్ను చేరుకుంటారా?'' అని అడిగాడు.

అందుకు జయవిజయులు, ''నిన్ను విడిచి ఎక్కువకాలం వుండలేము. పరమ దుర్మార్గులం, ప్రజాకంటకులం అనిపించుకున్నాసరే, మూడు జన్మలెత్తి నిన్ను చేరుకుంటాము.'' అని చెప్పారు.

ఆ విధంగా, వాళ్ళు కృతయుగంలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగానూ, త్రేతాయుగంలో రావణ, కుంభకర్ణులుగానూ, ద్వాపరయుగంలో శిశుపాల, దంతవక్త్రులుగానూ పుట్టి, దుర్మార్గాలు చేసి, చివరకు విష్ణుమూర్తిని చేరుకున్నారు.

పెద్దపెద్ద, యీ విధంగా గ్రామస్థులకు జయవిజయులకథ చెప్పి, ''ఇంతవరకూ చెప్పింది, మీ అందరికి తెలిసిన కథే! ఆ తర్వాత కలియుగం వచ్చింది. కలిపురుషుడికి—అన్ని యుగాలనూ మించి, తన యుగం ఎక్కువ పేరు తెచ్చుకోవాలన్న కోర్కె కలిగింది. అతను విష్ణుమూర్తిపద్దకు వెళ్ళి, ''అన్ని యుగాల్లోనూ జయవిజయులు పుట్టి, దుర్మార్గాలు





చేశారు. నా యుగంలో కూడా, వాళ్ళు పుట్టి, దుర్మార్గాలు చేసేలా అనుగ్రహించు. లేకపోతే నీది పక్షపాతబుద్ధి అవుతుంది,'' అన్నాడు.

విష్ణువు, కలిపురుషుణ్ణి అనుగ్రహించాడు. ఆ విధంగా జయవిజయు లిద్దరూ, మా ఇళ్ళల్లో పుట్టారు. మా బిడ్డ లిద్దరూ, సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు ద్వారపాలకులు. త్వరత్వరగా పాపాలు చేసి, శ్రీమహావిష్ణువును చేరాలనుకుంటున్నారు. అందుకు, విష్ణువే అంగీకరించినప్పుడు, మనం ఏం చేయగలం? సహించకతప్పదు! మనం వీళ్ళను ఎదిరిస్తే, విష్ణువుకు ఆగ్రహం వస్తుంది. విష్ణువుకు ఆగ్రహం తెప్పించడానికి, మీకు అభ్యంతరం లేకపోతే, వాళ్ళు మా బిడ్డలని కూడా కనికరించకుండా, కఠినంగా శిక్షించగలం! ఏం చేయాలో, మీరే చెప్పండి,'' అని అడిగాడు.

"జయవిజయులంతటివాళ్లను, మనం ఏం చేయగలం? వాళ్ళను అంతం చేయడానికి, ఆ శ్రీమహావిష్ణువే వస్తాడు. అంత వరకూ ఎదురు చూడక తప్పదు,'' అన్నారు గ్రామస్థు లందరూ ఏకకంఠంతో.

ఆనాటి నుంచీ శతనందన గ్రామంలో, గ్రామ పెద్దల కొడుకు లిద్దరికీ ఎదురు లేకుండా పోయింది. గ్రామస్థులు, వాళ్ళేం చేసినా పట్టించుకోవడం మానేసి, భరించడం నేర్చుకున్నారు. క్రమంగా పెద్ద పెద్ద కొడుక్కు జయుడనీ, చిన్న పెద్ద కొడుక్కు విజయుడనీ పేర్లు స్థిరపడ్డాయి.

జయుడు, విజయుడు యిప్పుడు ఇరవై ఏళ్ళ వయసు వాళ్ళయ్యారు. గ్రామంలో వాళ్ళు చెయ్యని అగడమంటూ లేదు.

ఇలా వుండగా, ఆ గ్రామానికి ఒక రోజున పరదేశీ ఒకడు వచ్చాడు. అతడికి ఇరవై సంవత్సరాల వయసుంటుంది. పచ్చని దబ్బపండు వంటి శరీరచ్ఛాయ, ఆరడుగులపొడవు, అందమైన రూపం, ముఖంలో అపురూపమైన తేజస్సు చూసి—చాలామంది అతడు గొప్ప రాజవంశస్థుడై వుంటాడనుకున్నారు.

పరదేశి ముందుగా కొంతసేపు, ఒక చెట్టు కింద కూర్చున్నాడు. చాలా దూరం నుంచి నడిచి వచ్చాడేమో, మనిషి బాగా అలిసిపోయి వున్నాడు. కాసేపు సేద తీరాక, ఆ దారినేపోతున్న ఒక దానయ్యను పలకరించి, ''బాబూ, ఈ ఒక్క రోజూ, నీ ఇంట వుంటాను, సమ్మతమేనా ?'' అని అడిగాడు.

దానయ్య కంగారుగా, ''ఏమో, మా గ్రామపెద్ద నడిగి చెబుతాను,'' అని వెళ్లిపోయాడు.

పరదేశి ఆశ్చర్యపడుతూ, చెట్టు కింది నుంచిలేచి బయలుదేరాడు. అప్పుడతడికి, నది నుంచి నీరు తెచ్చుకుంటున్న ఒక స్త్రీ కనిపించింది. పరదేశి, ఆమెను, ''అమ్మా, దాహంగా వున్నది. కాసిని మంచినీళ్ళిస్తారా ?'' అని అడిగాడు.

ఆ స్త్రీ, ''ఏమో, మా గ్రామపెద్ద నడిగి చెబుతాను,'' అని వెళ్ళిపోయింది.

ఆ తర్వాత పరదేశి, దారిలో ఎదురైన చాలామందిని పలకరించాడు. అతడే మడిగినా, అందరూ గ్రామ పెద్ద గురించే చెప్పసాగారు. తమాషాగా వున్నదే—అను కుంటూ పరదేశి గ్రామ వీధులన్నీ తిరుగు తూండగా, అతడికి ఒక ఇంట్లో నుంచి ఏడుపులు వినిపించినై. కారణం ఏమిటో తెలుసుకోవాలనుకుని, అతడు ఆ ఇంట్లో అడుగుపెట్టాడు.

అక్కడ నేల మీద ఒక చాపవేసి వున్నది. దాని మీద పదేళ్ళ కుర్రవాడొకడు



పడుకుని వున్నాడు. వాడిచుట్టూచేరి, పది మంది పెద్దవాళ్ళు శోకాలు పెడుతున్నారు.

పరదేశి, వాళ్ళను, ''ఏం జరిగింది? అందరూ, ఎందుకలా దుఃఖిస్తున్నారు?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న విని, వాళ్ళు తలలు ఎత్తి పరదేశిని చూశారు. వాళ్ళల్లో ఒకడు కంగారుగా, ''నువ్వు పరదేశివి గదా! మా గ్రామపెద్దకు చెప్పిందే, నీకెలాంటి జవాబూ యివ్వం,'' అన్నాడు.

పరదేశి, అతడి మాటలు పట్టించుకోకుండా ముందుకు వెళ్ళి, చాపమీద వున్న కుర్రవాడి పక్కనే కూర్చుని, నాడి పరీక్షించి చూసి, ''మీరెందు కేడుస్తున్నారో, తెలియడం లేదు! ఈ బాలుడి ఆరోగ్యానికెలాంటి ప్రమాదమూ లేదు. నేను వైద్యం చేసి బతికించగలను,'' అన్నాడు.

అప్పుడు, వాళ్ళల్లో ఒక స్త్రీ, ''మేము చేసిన పాపాలకు ఫలితంగా, వీడు చచ్చిపోక తప్పదు. మా గ్రామ పెద్ద వైద్యం చేసినా, వీడికి నయం కాలేదు. ఇంకెవరైనా వైద్యం చేసినా, వీడి ప్రాణాలు దక్కవు గాని —చచ్చి నరకానికి పోతాడు!'' అన్నది.

పరదేశి తను వైద్యం చేసేందుకు, వాళ్ళ అనుమతి కోసం అడిగాడు. వాళ్లు ఒప్పుకోలేదు. చివరికతడు బాగా విసిగిపోయి, ''మీరు వద్దన్నా సరే—నా కళ్ళ ముందు ఒక మనిషి ప్రాణాలు పోతూంటే, చూస్తూ ఊరుకోను. నేని బాలుడికి వైద్యం చేసి తీరుతాను,'' అన్నాడు.

''మేము, నిన్ను వైద్యం చెయ్యనివ్వం''! అన్నారు అందరూ ఏకకంఠంతో.

పరదేశి . వెంటనే, ''నన్ను వైద్యం చెయ్యకుండా, ఎలా ఆపగలరు? అలా ఆపమని గ్రామపెద్ద, మీకు చెప్పలేదు గదా?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే, బాలుడి చుట్టూ వున్నవాళ్ళు సందిగ్ధంలో పడ్డారు. ఈ పరదేశి చెప్పింది, నిజమే! మనం త్వరగా వెళ్ళి, పెద్దల అనుమతి తీసుకు రావాలి అనుకుని, వాళ్ళల్లో యిద్దరు పెద్దల ఇళ్ళకు పరిగెత్తారు. —(ఇంకా ఉంది)





# అపకారికి ఉపకారం

## 4

పెద్దల అనుమతి తీసుకురావాలని ఇద్దరు గ్రామస్థులు వెళ్ళిన వెంటనే, పరదేశి, ఆ బాలుడి అరికాళ్లూ, అరచేతులూ బాగా రుద్దాడు. తర్వాత అరచేతితో, వాడి గుండెల మీద రాశాడు. కొద్ది క్షణాల్లో బాలుడు కళ్లు తెరిచి, చిన్నగా మూలిగాడు.

పరదేశి వెంటనే లేచి, ఇంటిపెరట్లోకి వెళ్ళాడు. అక్కడ వున్న ఏవో చెట్ల ఆకులు కోసుకువచ్చి, "ఈ ఆకులు, ప్రతి ఇంటి పెరటిదొడ్లోనూ వుంటాయి. వీటితో ఎన్నో రకాల వ్యాధులను నయం చేయవచ్చు," అంటూ, వాటిని తన రెండు అరచేతుల మధ్యా నలిపి, వచ్చిన రసాన్ని, ఆ బాలుడి నోట్లో నాలుగైదు చుక్కలు పోశాడు.

మరుక్షణం, బాలుడు లేచి కూర్చుని, తల్లిదండ్రులకేసి చూస్తూ చిన్నగా నవ్వాడు. బాలుడి తల్లి పట్టరాని ఆనందంతో పరదేశికి నమస్కరించి, "నువ్వు, మనిషివికాదు; దేవుడివి! చచ్చిపోయాడనుకున్న, నా బాబును రక్షించావు," అన్నది.

ఈలోగా, గ్రామపెద్ద లిద్దరూ అక్కడికి వచ్చారు. జరిగింది చూసి తెల్లబోయారు.

చిన్నపెద్ద, పరదేశివంక క్రూరంగా చూస్తూ, "మా మందులకు బతకనివాడు, నీ మందుకు బతికాడంటే, నువ్వు మాంత్రికుడివై వుండాలి. మా గ్రామాని కెందుకు వచ్చావో చెప్పు?" అని గద్దించి అడిగాడు.

పరదేశి ఎంతో శాంతంగా, "అయ్యా, నేను మాంత్రికుణ్ణి కాదు. హిమాలయాల్లో, ఒక గొప్ప తపశ్శాలివద్ద పెరిగాను. ఆయన



దగ్గిరే. సకలవిద్యలూ అభ్యసించాను. మంచితనంతో పదిమందికి సేవచేయమని. ఆయన ఆదేశించగా. దేశాలు తిరుగుతూ. యిక్కడికి వచ్చాను. నా కళ్ళముందే. ఒక నిండు ప్రాణం పోతూండగా చూడ లేక, నాకు తెలిసిన వైద్యం చేశాను." అని. గ్రామపెద్దలకు తన కథ చెప్పు కున్నాడు.

"మా అనుమతి లేకుండా. యీ బాలుడికి వైద్యం చేశావు. అందువల్ల. ఈ గ్రామానికే అరిష్టం. ఆ అరిష్టం పోవా లంటే—ఏ బాలుడినైతే నువ్వు బతికిం చావో. ఆ బాలుడి తల్లిదండ్రులే నిన్ను కొరడా దెబ్బలు కొడితే. భరించాలి. ఇందుకు. అంగీకారమేనా?" అని అడిగాడు పెద్దపెద్ద.

"ఆ విధంగా. మీ గ్రామానికి అరిష్టం తొలగిపోతుందంటే, ఆ దెబ్బలు తిన డానికి. నేను సిద్ధంగా వున్నాను." అన్నాడు పరదేశి.

పెద్దలు ఆజ్ఞాపించగా, ఆ బాలుడి తల్లి దండ్రులు, చెరొక పది కొరడా దెబ్బలు పరదేశిని కొట్టారు. పరదేశి వీపు చిట్లి రక్తం కారింది.

"మా గ్రామానికి అరిష్టం పోయింది. తక్షణం. నువ్వు గ్రామాన్ని విడిచివెళ్ళు!" అన్నారు పెద్దలిద్దరూ.

అందుకు పరదేశి. "అయ్యా. నావల్ల వచ్చిన అరిష్టం పోయే ఉపాయం, మీరే చెప్పారు. నేనెవరికే సాయం చేసినా, వారివల్ల ఇరవై కొరడా దెబ్బలు తింటూం టాను. ఆ విధంగా, మీ గ్రామానికే అరిష్టమూ వుండదు. నన్ను. ఈ గ్రామంలో కొంతకాలం వుండనివ్వండి." అన్నాడు.

ఈ జవాబు విని, గ్రామ పెద్దలు చాలా ఆశ్చర్యపడ్డారు. చిన్నపెద్ద. పరదేశిని, "నువ్వు మూర్ఖుడిలా వున్నావు! దెబ్బలు తింటూ, ఈ గ్రామంలోనే వుండాలని ఎందుకనుకుంటున్నావు?" అని అడిగాడు.

"అయ్యా, అపకారికూడా ఉపకారం చెయ్యమని, అన్ని శాస్త్రాలూ, పురాణాలూ



చెబుతున్నవి. అలాంటిది—ఈ గ్రామంలో ఉపకారం చేసిన నన్ను, కొరడా దెబ్బలు కొట్టి శిక్షించేటంత మూర్ఖులున్నారు. నాలాంటివాడు తప్ప, ఇలాంటి వాళ్ళకు మరెవరు సాయం చేయగలరు? వీళ్ళమీద జాలివల్లే, యిక్కడ కొంతకాలం వుండా లనుకుంటున్నాను,'' అన్నాడు పరదేశి.

పెద్దలిద్దరికీ, ఏం జవాబు చెప్పాలో తెలియలేదు.

ఈ పరదేశివల్ల, తమ అధికారానికి ప్రమాదం రావచ్చుని, వాళ్ళు అనుమానించి, ''నువ్వు, ఎన్ని చెప్పినా లాభం లేదు. వెంటనే గ్రామం వదిలిపో,'' అన్నారు కోపంగా.

''నేను వెళ్ళను!'' అన్నాడు పరదేశి నెమ్మదిగా.

''వెళ్ళకపోతే, నిన్ను బలవంతంగా పంపివేయగలం, తెలుసా?'' అన్నారు పెద్దలిద్దరూ రోషంగా.

పరదేశి చిరునవ్వు నవ్వి, ''నాకిష్టమై సహిస్తే సరే, కాని బలవంతంగా మాత్రం నన్నెవరూ ఏమీ చేయలేరు. నాకిష్టం లేనప్పుడు, నన్నెవరైతే కొడతారో వాళ్ళకే ఆ దెబ్బలు తగులుతాయి. నన్ను తోసిన వాళ్ళే పడిపోతారు. నాకు విషప్రయోగం చేసినవాళ్ళే చచ్చిపోతారు,'' అన్నాడు.

ఈ మాటలతో పెద్దలకు విపరీతమైన కోపం వచ్చింది. వాళ్ళక్కడున్న యిద్దరు యువకులతో, ''చూస్తారేం? వీడేదో మాంత్రికుడు. వెంటనే వీధి అవతలికి ఈడ్చేయండి,'' అన్నారు.

వెంటనే యువకులిద్దరూ, పరదేశిని సమీపించబోయారు. కాని, అప్పుడు ఒక విచిత్రం జరిగింది. ఎవరో ఈడ్చినట్టుగా, వాళ్ళిద్దరూ పోయి వీధిలో పడ్డారు.

ఇది చూసి, పెద్దలిద్దరూ వెలవెల పోయారు. వాళ్ళింతవరకూ, పరదేశిని బాగా వైద్యంతెలిసినవాడనే అనుకున్నారు. కాని, యిప్పుడు జరిగింది చూశాక, వాళ్ళకతడు మాంత్రికుడేమో అన్న భయం కలిగింది. పెద్దలకు మాయమాటలతో,

ప్రజల్ని మోసపుచ్చడం తెలుసుగాని, మంత్రతంత్రాలు తెలియవు.

''అయితే, నువ్వు నిజంగానే మాంత్రికుడి వన్నమాట! ఈ గ్రామానికి, మమ్మల్ని ఎదిరించడానికే వచ్చావా?'' అని అడిగాడు పెద్దపెద్ద.

''నేను మాంత్రికుణ్ణికాదు. ఇతరులకు ఉపకారం చేస్తూండడమే, నాపని. నేనిక్కడికి మిమ్మల్ని ఎదిరించడానికి రాలేదు. మీకు సేవచేయాలని వచ్చాను. మిమ్మల్ని సేవించుకుంటే తప్ప, మీ గ్రామ ప్రజలకు సాయపడలేనుగదా!'' అన్నాడు పరదేశి.

తమనెదిరించననీ, సేవించుకుంటాననీ, పరదేశి చెప్పగానే, పెద్దలిద్దరికీ సంతృప్తి కలిగింది. వాళ్ళు వెంటనే, పరదేశి ఆ గ్రామంలో వుండేందుకు అనుమతించారు.

తర్వాత పరదేశితో, చిన్నపెద్ద, ''నువ్వు, మా అనుమతిలేకుండా ఎవ్వరికీ సాయపడకూడదు. ఆ సంగతి బాగా గుర్తుంచుకో,'' అన్నాడు హెచ్చరిస్తున్నట్టు.

''ఇతరులకు సాయపడే విషయంలో, నేనెవరి అనుమతికోసం ఎదురుచూడను. హాని చేయమంటే, నేనీదేశపు రాజు మాట కూడా వినను. మిగతా అన్ని విషయాల్లోనూ, మీరేం చెప్పినా చేస్తాను,'' అన్నాడు పరదేశి నిర్భయంగా.

పెద్దలిద్దరూ అయిష్టంగా తలలాడిస్తూ, అక్కణ్ణించి బయలుదేరారు. వాళ్ళ



నివాసం పక్క, పక్క ఇళ్ళల్లో. ఆ ఇళ్ళ మధ్య ఒక చావడి వున్నది. గ్రామస్థులు, ఆ చావడిలోనే, పెద్దలతో సంప్రతింపులు చేస్తూంటారు.

వాళ్ళ ఇళ్ళకు ఎదురుగా, ఒక పెద్ద దిబ్బ వున్నది. దానిమీద చిన్న గుడిసె ఒకటి వేయించి, పరదేశిని అందులో వుండమన్నారు. పరదేశి అక్కడ నివసించ సాగాడు.

పెద్దలిద్దరికి, పరదేశి చాలా విచిత్రమైన మనిషిలా కనిపించాడు. అతడికి మంత్ర తంత్ర విద్యలు తెలిసినట్టు కనిపించినా, ఎవరిమీదా వాటిని ఎప్పుడుగాని ప్రయోగించలేదు. అతడెప్పుడూ చిరునవ్వుతో వుంటాడు తప్పితే, దేనికి ఎవరిమీదా కోపగించుకోడు.

అతడు రోజూ పనిగట్టుకుని, గ్రామంలో ఎవరికెలాంటి కష్టమొచ్చిందో విచారించేవాడు. దానికి సులువైన పరిష్కార మార్గం చెప్పి, పెద్దలు ముందే నిర్ణయించిన విధంగా, వాళ్ళ చేత ఇరవై కొరడా దెబ్బలు తిని, ఆ బాధను మనోనిబ్బరంతో భరించేవాడు.

ఇలా కొంతకాలం జరిగేసరికి గ్రామస్థులకు, ఈ పద్ధతి చాలా అన్యాయం అనిపించింది. వాళ్ళల్లో కొందరు ఒక రోజున, పెద్దలిద్దర్నీ కలుసుకుని, "మాకు సాయపడుతున్నవాణ్ణి, మేమే కొట్టడం, మాకు బాధ కలిగిస్తున్నది. ఈ పద్ధతి మానివేయడం మంచిదేమో!" అన్నారు.

దానికి పెద్దపెద్ద కోపంగా, "అంటే, మీరు నాకే, నీతులు చెబుతున్నారన్నమాట! ఆ పరదేశి పెద్ద మాంత్రికుడు. మీరు కొట్టే కొరడా దెబ్బలేవీ, వాడికి తగలవు. వాణ్ణి గ్రామంనుంచి తరిమెయ్యడానికి శక్తి చాలక వూరుకున్నాం. వాడేదో సొంత మేలుకోసం, ఈ గ్రామం వచ్చాడు. మాంత్రికులనుంచి మేలు పొందడం, అరిష్టదాయకం. కావాలంటే, ఒకసారి వాణ్ణి కొట్టకుండా వూరుకోండి, ఏం జరుగుతుందో, మీకే తెలుస్తుంది," అన్నాడు.

—(ఇంకావుంది)





# అపకారికి ఉపకారం

**5**

పరదేశి ప్రమాదకరుడైన మాంత్రికుడనీ, అతన్ని కొట్టకుండా అతని నుంచి మేలు పొందడం అరిష్టదాయకం అనీ గ్రామ పెద్దలు, గ్రామస్థులకు చెప్పిన మర్నాడే, సీనయ్య అనేవాడి ఇంట్లో, అతడి భార్య నగలు పోయాయి. ఆమె ఒక గుడ్డలో నగలు పెట్టి, మూటగా కట్టి, చెరువుకు స్నానానికి వెళ్ళింది. తిరిగి వచ్చి చూస్తే, నగలు కనిపించలేదు.

ఈ విషయం తెలిసి పరదేశి, సీనయ్య ఇంటికి వెళ్ళి, వివరాలన్ని అడిగి తెలుసుకున్నాడు. తర్వాత ఇల్లంతా కలయతిరిగి, ఒక మూలనున్న కన్నం చూపి, అందులో వెతకమన్నాడు. అది పందికొక్కులు చేసిన కన్నం. సీనయ్య అక్కడ తవ్వి చూడగా, నగలున్న మూట దొరికింది.

ఈ సహాయానికి సీనయ్య, పరదేశిని ఇరవై కొరడాదెబ్బలు కొట్టవలసి వున్నది. కాని, సీనయ్య అలా చేయలేదు. పరదేశిని కొట్టకపోతే, ఎలాంటి అరిష్టం వస్తుందో, చూడాలనుకున్నాడు.

ఆ రాత్రి రహస్యంగా గ్రామ పెద్దలిద్దరూ కలిసి, సీనయ్య పొలంలో, ఒక ధాన్యపు కుప్పకు నిప్పు పెట్టి వచ్చారు. మర్నాడు సీనయ్య లబోదిబోమంటూ, గ్రామ పెద్దల దగ్గిరకు వెళ్ళాడు.

వాళ్లు, సీనయ్య చెప్పినదంతా విని, ''ఇంకేం! నువ్వా పరదేశిని కొట్టకపోవడం వల్లనే, యీ అరిష్టం వచ్చిపడింది,'' అన్నారు.

ఈ సంగతి, గ్రామంలో అందరికీ తెలిసింది. గ్రామస్థు లందరూ పనిగట్టుకుని,

"వసుంధర"



పెద్దల ఇళ్ళకు వెళ్ళి, "సీనయ్యతోపాటు, మేము కూడా ఏవైనా తప్పులు చేసి వుంటే, మమ్మల్ని మన్నించండి! ఇకముందు, అంతా మీరు చెప్పినట్టే చేయగలం," అని చెప్పారు.

ఇది విన్న పరదేశి, గ్రామ పెద్దలను కలుసుకుని, "అయ్యా, యిది చాలా అన్యాయం! మీరే, ఆ సీనయ్య ధాన్యపు కుప్పను తగలబెట్టారని, నాకు తెలుసు. మీరు వెంటనే సీనయ్యకు, అతడు నష్టపోయిన ధాన్యం, యిచ్చెయ్యండి. మీరు అలా చేయకపోతే, అంతకు మించిన నష్టం, మీకు కలుగుతుంది." అని హెచ్చరించాడు.

"మమ్మల్ని భయపెట్టాలని చూస్తున్నావా? మాకు కలగబోయే నష్టం ఏమిటి?" అన్నారు పెద్దలు కోపంగా.

"ఈ రోజున, ఒక ధాన్యపుబస్తా, రేపటి నుంచి, రోజూ కొక ధాన్యపుకుప్ప. అదీ, మీకు కలగబోయే నష్టం." అని పరదేశి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి, నిజంగానే, ఆ పెద్దల ఇండ్ల మధ్య చావడిలో వున్న, ఒక ధాన్యపు బస్తా, హఠాత్తుగా నిప్పంటుకుని కాలి బూడిద అయిపోయింది. విచిత్రమేమిటంటే—ఆ ధాన్యపు బస్తా మంటలు, చుట్టుపక్కల వున్న బస్తాలకుగానీ, యితర సామగ్రికిగానీ సోకలేదు.

ఇది చూసి భయపడిన పెద్దలిద్దరూ, పరదేశి దగ్గిరకుపోయి, "నువ్వు చెప్పినట్టే జరిగింది! అసలింతకూ, నువ్వెవరివి?" అని ప్రశ్నించారు.

"నేనెవరినైతేనేం? ఇతరులకు హాని కలిగించను. మీ యిద్దరికీ అధికారమంటే, తగని ఆశ. మీ అధికారానికి, నేనడ్డు రాను. అయితే, నేను యితరులకు సాయం చేస్తుంటే, మీరు నన్నాపకూడదు. మీరు యితరులకు హాని చేయకూడదు." అన్నాడు పరదేశి.

"అయితే, మమ్మల్ని, ఏం చేయమంటావు?" అని అడిగాడు చిన్నపెద్ద.



"మీరు సీనయ్య దగ్గిరకు వెళ్ళి, నన్ను యిరవై కొరడాదెబ్బలు కొట్టమనండి. ఈలోగా, అతడి ధాన్యపుకుప్పలో బూడిదైన ధాన్యం ఎంత వుంటుందో, అంతా అతడి పొలంలో పోయించండి. ఇదంతా రహస్యంగా జరిగిపోవాలి. ఇలా చేయడం వల్ల, సీనయ్యకు జరిగిన నష్టం తీరిపోతుంది. గ్రామ పెద్దలుగా, మీకు పేరూ వస్తుంది," అని సలహా యిచ్చాడు పరదేశి.

పెద్దలిద్దరూ పరదేశి చెప్పినట్టే చేశారు. పరదేశి ఇరవై కొరడాదెబ్బలు తిన్నాడు. ఆ రాత్రి, పెద్దలిద్దరూ రహస్యంగా కొన్ని ధాన్యం బస్తాలు బండి మీద వేసుకుపోయి, సీనయ్య పొలంలో వేసి వచ్చారు.

మర్నాడు, జరిగింది తెలిసి, గ్రామంలో అందరూ విడ్డూరంగా చెప్పుకున్నారు. పరదేశి ఎవరో, గ్రామంలో అందరికీ ఎందుకు సాయపడుతున్నాడో, దెబ్బలు తింటూ కూడా, ఆ గ్రామంలోనే ఎందుకుండాలనుకుంటున్నాడో—ఎవరికీ అర్థంకాలేదు. కాని, గ్రామ పెద్దల పలుకుబడీ, వాళ్ళ మీద గ్రామస్థుల నమ్మకం మరింతగా పెరిగాయి.

ఇక, జయవిజయు లిద్దరూ, పరదేశిని గురించి మొదట్లో అంతగా పట్టించుకోలేదు. తల్లిదండ్రులు, వాళ్ళను, "మీరా పరదేశి జోలికి పోకండి. వాడు చాలా ప్రమాదకారి!" అని చాలాసార్లు హెచ్చరించారు.

ఒక రోజున, నది ఒడ్డున జయవిజయులిద్దరూ, అక్కడికి బిందెతో నీళ్ళకోసం వచ్చిన, ఒక అమ్మాయిని ఎగతాళి చేస్తూ అటపట్టిస్తున్నారు.

ఇద్దరూ కలిసి, ఆ అమ్మాయి నుంచి బిందె లాక్కుని, "ఆ కనబడే మామిడి చెట్టెక్కి, మా ఇద్దరికీ చెరో నాలుగు మామిడిపళ్ళు కోసిస్తే, నీ బిందె తిరిగి యిస్తాం. అలా చేయకపోయావే, నీ బిందెను నదిలో పారవేయడమే కాక, నిన్నిక్కణ్ణించి వెళ్ళనివ్వం!" అన్నారు.



ఆ అమ్మాయికి, ఏం చేయాలో తోచక, బిక్కమొహం వేసుకుని నిలబడింది. అంతలో, ఆ దారిన పరదేశి వచ్చి, జరిగింది, ఆ అమ్మాయిని అడిగి తెలుసుకుని, జయవిజయులతో, "మీకు కావలసింది, చెట్టెక్కి మామిడిపళ్ళు కోయడమే గదా? నేనా పని చేస్తాను. ఈ అమ్మాయికి బిందె యిచ్చెయ్యండి," అన్నాడు.

"ముందు పళ్ళు కోసివ్వు: అలాగే వదిలేస్తాం," అన్నాడు జయుడు.

అసలు సంగతేమంటే—అది మామిడి పళ్ళ ఋతువు కాదు. చెట్టున ఒక్క పండయినా లేదు. అందువల్ల, పళ్ళు కోసివ్వడం, పరదేశివల్ల కాదనుకున్నారు వాళ్ళు. కాని, పరదేశి చెట్టెక్కి, ఎనిమిది మామిడిపళ్ళు కోసి, వాళ్ళకిచ్చాడు!

జయవిజయు లిద్దరూ తెల్లబోయి, "కాలం కానికాలంలో, చెట్టెక్కి పళ్ళెలా కోశావు?" అని అడిగారు.

"ఏమాత్రం స్వార్థం లేకుండా, ఇతరులకు సాయం చేయాలనుకుంటే, ఏ చెట్టునడిగినా పళ్ళిస్తుంది: ఏ గుట్టనడిగినా మణులిస్తుంది," అన్నాడు పరదేశి.

"అయితే, ఏ గుట్టనయినా అడిగి, మాకు మణులు తెచ్చిపెట్టు," అన్నాడు విజయుడు.

"ఇచ్చిన పళ్ళు చాలు. మణులేం ఇవ్వను. ముందా అమ్మాయిని వెళ్ళనివ్వండి," అన్నాడు పరదేశి.

జయవిజయులు అందుకు ఒప్పుకోక, మొండికెత్తారు.

అప్పుడు పరదేశి, ఆ అమ్మాయితో, "వాళ్ళు, నిన్నేమీ చెయ్యలేరు. నీ బిందె తీసుకుని, వెళ్ళిపోమ్మా!" అన్నాడు.

ఆ అమ్మాయి వెంటనే బిందె తీసుకుని బయలుదేరింది. ఆమెను ఆపాలని జయవిజయు లిద్దరూ అనుకున్నారు. కాని, వాళ్ళకు కాళ్ళూ చేతులు కదల్లేదు. ఆమె, కనుచూపు దాటిపోయిన తర్వాత, వాళ్ళకు కాళ్ళూ చేతులు స్వాధీనంలోకి వచ్చినై. నోరువిప్పి మాట్లాడగలిగారు.

''నువ్వు మాంత్రికుడివా?'' అని అడిగాడు జయుడు, పరదేశిని.

''నాకు తెలిసిన మంత్రం ఒక్కటే— అదే మంచితనం!'' అన్నాడు పరదేశి.

''మా సరదాకు అడ్డువచ్చావు. నువ్వేం మంచివాడివి,'' అన్నాడు విజయుడు.

''ఇతరులను బాధించనంతవరకూ, మీ సరదాలకు నేనడ్డురాను. ఇకమీదట మీరెప్పుడైనా, ఇతరులను బాధించాలనుకుంటేమాత్రం, మీ కాళ్ళూ చేతులు కదలవు; నోరు మెదలదు. బాగా గుర్తుంచుకోండి!'' అని పరదేశి అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత జయవిజయులకు, పరదేశి చెప్పినట్టే జరిగింది. వాళ్లు, గ్రామస్థులను బాధించడం, తగ్గిపోయింది. తమ సరదాలకు పరదేశి అడ్డుతగులుతున్నాడని, వాళ్ళు తండ్రులకు చెప్పుకున్నారు. అయినా, ఆ పెద్దలు, యీ విషయం అంతగా పట్టించుకోలేదు. జయవిజయులు దుర్మార్గకార్యాలుచేయకపోతే, గ్రామస్థులు తమనింకా ఎక్కువగా గౌరవిస్తారని, భావించారు.

ఈ విధంగా జయవిజయులకు, పరదేశి అంటే ద్వేషం ప్రారంభమైంది. వాళ్ళొకసారి, పరదేశి నిద్రపోతున్నప్పుడు తాళ్లతో బంధించి, నీటిలో పారవేయాలనుకున్నారు. అయితే, వాళ్ళు తాళ్ళు తీసుకుని పరదేశి ఇంట్లోకి వెళ్ళేసరికి, అవి వాళ్ళనే బంధించివేశాయి. వాళ్ళు కదల్లేక మూలుగుతూంటే, నిద్రపోతున్న పరదేశికి మెలుకువ వచ్చింది.

ఆయన, వాళ్ళ బాధ చూసి జాలిపడి, తనే వాళ్ళ కట్లు విప్పి, ''నన్ను మోసంతో ఎవరు బాధించాలనుకున్నా, అలాంటి హింసకు వాళ్ళే గురవుతారు. నేను ఒప్పుకుంటే తప్ప, నన్నెవరూ బాధించలేరు,'' అని చెప్పాడు.

జయవిజయులు, అప్పటికేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయారు. కాని, వాళ్ళలో పరదేశిని హతమార్చాలన్న పట్టుదల ఎక్కువయింది. —(ఇంకావుంది)





# అపకారికి ఉపకారం

## 6

జయవిజయులకు పరదేశిని ఎలాగైనా హతమార్చాలన్న పట్టుదల కలిగింది. పరదేశికి భోజనం, రోజూ జయవిజయుల యింటి నుంచే వెళ్ళేది. పరదేశిని బాధించాలని, వాళ్ళు అందులో ఒక రోజున, బాగా కారం కలిపారు. ఇందువల్ల, పరదేశికి ఎలాంటి బాధాకలగలేదుగాని, వాళ్ళ భోజనం కారం మయమైపోయి, నోరంతా పొక్కింది.

ఇది జరిగినా, వాళ్ళు బుద్ధి మార్చుకోక, మరొక రోజున పరదేశి భోజనంలో విషం కలిపారు. అంతే! ఆ పూట భోజనం చేస్తూనే, జయవిజయు లిద్దరూ, వాంతులు చేసుకుని స్పృహ తప్పి పడిపోయారు.

పెద్దపెద్దా, చిన్నపెద్దా వాళ్ళను పరీక్షించి చూస్తే నాడి అందడం లేదు. ఇద్దరూ కంగారుపడి, పరదేశి వద్దకు పరిగెత్తారు.

పరదేశి జరిగింది విని, ''వాళ్ళు, నా భోజనంలో విషం కలిపివుంటారు! ఆ విషం నాకు ప్రమాదం కలిగించకపోగా, ఎదురుతిరిగి కలిపినవాళ్ళకే ప్రమాదం కలిగిస్తుంది. ఈసారికి, వాళ్ళనెలాగో రక్షిస్తాను. మరొకసారి యిలా జరిగితే, వాళ్ళను నేను కూడా రక్షించలేను.'' అంటూ పెద్దల ఇంటిపెరట్లోకి వెళ్ళి, అక్కడేవో మొక్కల ఆకులు దూసితెచ్చి, వాటి పసరును జయవిజయుల నోట్లో పోశాడు.

ఆ వెంటనే, వాళ్ళిద్దరూ లేచి కూర్చున్నారు. చిన్నపెద్దా, పెద్దపెద్దా వాళ్ళకు జరిగిందిచెప్పి, ''దుడుకుతనం కొద్దీ, మీ

"వసుంధర"



ప్రాణాల మీదికి తెచ్చుకున్నారు. ఈనాటి నుంచీ, ఆ పరదేశి జోలికి పోకండి,'' అని హెచ్చరించారు.

జయవిజయు లిద్దరూ, పరదేశి కాళ్ళ మీద పడి, ''నువ్వు నిజంగానే గొప్ప మాంత్రికుడివి! మేము, నీకు అపకారం చేయకూడదనే అనుకుంటున్నాం కానీ— మావి వక్రబుద్ధులు. మా బుద్ధులు మంచి మార్గాన నడిచే ఉపాయం, నువ్వే చెప్పాలి!'' అన్నారు.

పరదేశి కొంచెంసేపు ఆలోచించి, ''మీరు చెప్పింది నిజం! మీ బుద్ధులు సరి దిద్దడం, నా బాధ్యత,'' అని, విజయుడి భుజం పట్టుకుని, ''రేపు జయుణ్ణి ఇక్కడే వదిలి, నువ్వు కొందరు గ్రామస్థులను వెంటబెట్టుకుని అరణ్యానికి వెళ్ళు. అక్కడ మీకు తోచిన ఒక చెట్టును ఎన్ను కుని, కాసేపు దానిచుట్టూ తిరిగి, తర్వాత శ్రీమహావిష్ణువు నామాన్ని స్మరిస్తూ కళ్ళు మూసుకోండి. కొన్ని క్షణాలు గడిచాక, మీ ముందు ఒక దేవత ప్రత్యక్షమవు తుంది. మీరా దేవతతో జయుడు పంపగా వచ్చామని చెప్పండి. ఆమె, మీతో బయలు దేరి గ్రామానికి వచ్చేస్తుంది. ఆ దేవత, మీ యిద్దరి బుద్ధులూ మార్చగలదు!'' అని చెప్పాడు.

మర్నాడు విజయుడు, కొందరు గ్రామస్థులతో కలిసి, సమీపంలో వున్న అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ ఒక చెట్టును ఎన్నుకుని, దానిచుట్టూ తిరిగి, శ్రీమహావిష్ణువును స్మరించుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.

కొద్దిసేపటికి పెద్దగా చప్పుడు వినిపించింది. గ్రామస్థులు, ''దేవత ప్రత్యక్షమైంది! దేవత ప్రత్యక్షమైంది!'' అంటూ కేకలు పెట్టారు.

విజయుడు కళ్ళు తెరిచి ఆశ్చర్య పోతూ, ''ఏం జరిగింది?'' అని వాళ్ళను అడిగాడు.

గ్రామస్థులు చెట్టుకు ఒకపక్కగా సొమ్మసిల్లి పడివున్న ప్రియంవదను

చూపుతూ, ''ఎక్కడి నుంచి వచ్చిందో తెలియదు, ఇదిగో, దేవత!'' అన్నారు.

విజయుడు, ప్రియంవదను సమీపించి పరీక్షగా చూసి, ఆమె స్పృహ తప్పి వున్నట్టు గ్రహించి, గ్రామస్థులకు నీళ్ళు తేవలసిందిగా చెప్పాడు. వాళ్ళు నీళ్ళు తేగానే, ఆమె ముఖం మీద చల్లాడు.

ప్రియంవద కళ్ళు తెరిచి, ''నేనెక్కడ వున్నాను?'' అన్నది.

అందుకు విజయుడు, ''మేము యిక్కడికి దగ్గరలో వున్న గ్రామస్థులం. జయుడు పంపగా వచ్చాం. మాతో గ్రామానికి వస్తావా?'' అని అడిగాడు.

జయుడి పేరు వింటూనే ప్రియంవద, అతడు తమ అంతఃపురంలోని కాపలా భటుడనుకున్నది. ఆ కారణంవల్ల, ఆమె అంగీకార సూచకంగా తలవూపి, ''నాకు బాగా ఆకలిగా వున్నది.'' అన్నది.

''నీవు కోరినవన్నీ యిస్తాం. మాతో గ్రామానికి బయలుదేరు.'' అన్నాడు విజయుడు.

గ్రామస్థులు ప్రియంవదను దేవతగా భ్రమించి, ఆమె కోసం ఒక పల్లకి తెచ్చారు. ప్రియంవదను అందులో కూర్చోబెట్టి, అందరూ శతనందనగ్రామం చేరారు. తర్వాత ఆమెను, పరదేశి నివసించే యింట వదిలిపెట్టారు.



పరదేశి చెప్పిన విధంగానే దేవత ప్రత్యక్షమైనదని విని, గ్రామంలోని పిల్లా, పెద్దా అందరూ ప్రియంవదను చూడ వచ్చారు. ఆమె అందచందాలు చూసి అందరూ అబ్బురపడ్డారు.

పరదేశి, గ్రామస్థులంతా అక్కడినుంచి వెళ్ళిపోయేదాకా ఆగి, ''ఎవరు నువ్వు? అరణ్యంలో హఠాత్తుగా ఎలా ప్రత్యక్షమయావు?'' అని ప్రియంవదను అడిగాడు.

ప్రియంవద, పరదేశి ముఖంలోని దివ్య తేజస్సుకు ఆశ్చర్యపడి, ''అయ్యా, నీ వెవరో చూడబోతే యువకుడిలా వున్నావు. కాని, ముఖంలో మహాజ్ఞానులకు మించిన



తేజస్సు ఉట్టిపడుతున్నది! మీ ముందు, నా చరిత్ర దాచలేను,'' అని, తన కథ అంతా పరదేశికి వివరించి చెప్పింది.

అది విని పరదేశి, ఆమెకు తన కథ చెప్పి, ''అంతా చిత్రంగా వున్నది. ఒక జయుడి కోసమని బయులుదేరి, మరొక జయుడున్న చోటుకు చేరావు. ఏ దైవం, నా చేత ఆ పేరు పలికించిందో తెలియదు గాని, నిజంగానే దేవతలా వచ్చావు. ఇప్పుడేమి చేయడం బావుంటుందో, నువ్వే చెప్పు.'' అన్నాడు.

ప్రియంవద, ఆ మాటలకు సిగ్గు పడుతూ, ''నిన్ను చూడగానే, నా మనసులో ఎన్నడూ ఎరుగని సంతోషం పుట్టింది. నాకు, నీ దగ్గిరే వుండిపోవాలనిపిస్తున్నది. నా కిప్పుడు మరే యితర కోరికాలేదు,'' అన్నది.

ఈ జవాబు వింటూనే, పరదేశి కంగారు పడి, ''నువ్వు, జయవిజయుల బుద్ధులను సక్రమమార్గంలో పెట్టగలవనుకుంటున్నాను. ముందు, ఆ పని చూడడం, నా కర్తవ్యం,'' అన్నాడు.

''నువ్వు ఏం చెబితే అది చేస్తాను,'' అన్నది ప్రియంవద.

ఆ తర్వాత పరదేశి, ప్రియంవదకు తృప్తిగా భోజనం పెట్టించాడు. ఆ వెంటనే ఆమెకు నిద్ర ముంచుకువచ్చింది.

ఈ లోపల జయుడు, విజయుడు కూడా, ప్రియంవద అందచందాలకు బాగా ఆకర్షితులయ్యారు. ఆ కారణం వల్ల, ఆనాటి నుంచీ యిద్దరూ, ఆమె వద్దనే వుంటూ, యితర విషయాలేమీ పట్టించుకోవడం మానేశారు.

ఒక రోజున జయుడు, ప్రియంవదతో, ''ఎల్లకాలం, నువ్వు మాతోనే వుండిపోతే, ఎంతో బావుంటుంది,'' అన్నాడు.

''అదెలా సాధ్యం? మరి కొన్నాళ్ళకు, నా పెళ్ళి జరిగిపోతుందిగదా!'' అన్నది ప్రియంవద.

''పెళ్ళయిపోతే ఏం?'' అని ప్రశ్నించాడు, విజయుడు అమాయకంగా.

''పెళ్ళయాక, నేను నా భర్త దగ్గిర వుండిపోతాను. ఇక్కడ వుండడం కుదరదు.'' అన్నది ప్రియంవద.

జయుడు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, ''పోనీ, నువ్వు నన్నే పెళ్ళి చేసుకోరాదా,'' అన్నాడు.

''అందుకు విజయుడు ఒప్పుకుంటాడా?'' అన్నది ప్రియంవద.

''ఒప్పుకోను. నేను, నిన్నే పెళ్ళాడతాను.'' అన్నాడు విజయుడు పట్టుదలగా.

జయుడు, విజయుడి కేసి కోపంగా చూశాడు. ఇద్దరూ వాదులాటకు దిగారు.

ప్రియంవద, వాళ్ళను వారిస్తూ, ''మీ ఇద్దరిలో ఒకరినే, నేను పెళ్ళి చేసుకోగలను. అందుకొక ఉపాయం వున్నది. ఈ గ్రామంలో వున్న పరదేశి, చాలా ప్రమాదకారుడు. అతణ్ణి, మీ యిద్దరిలో ఎవరు ఓడిస్తే, అతణ్ణి నేను పెళ్ళాడతాను,'' అన్నది.

''ఆ పరదేశి, మాయలమారి, మహా మాంత్రికుడు. వాడిని ఓడించడం, మా యిద్దరివల్లా కాదు.'' అన్నారు, జయ విజయులు ఏక కంఠంతో.

''నిజంగా నన్ను పెళ్ళాడదలిస్తే, మీరెలాంటి కఠిన కార్యాన్నయినా సాధించగలరు. ఆ పరదేశిని ఓడిస్తే తప్ప, లేకపోతే నేను మీలో ఒకరిని పెళ్ళాడలేను.'' అన్నది ప్రియంవద.

జయుడు అనుమానంగా చూస్తూ, ''నిన్ను పెళ్ళాడాలంటే, ఆ పరదేశిని ఓడించాలా? ఎందుకు?'' అని అడిగాడు.

''ఎందుకేమిటి? ఆ పరదేశి మనకు పక్కలోబల్లెం వంటివాడు. రేపు నేను మీలో ఒకర్ని వివాహమాడాక, అతడు నన్ను బలవంతంగా ఎత్తుకుపోతే, అప్పుడు మీరేం చేస్తారు? అందువల్లనే, అతణ్ణి ముందుగా ఓడించమంటున్నాను,'' అన్నది ప్రియంవద.

''నువ్వు చెప్పింది నిజమే! రేపే ఆ పరదేశితో యుద్ధం చేసి, చిత్తుగా ఓడించేస్తాను.'' అన్నారు జయవిజయులిద్దరూ ఒకేసారి.

—(ఇంకావుంది)





# అపకారికి ఉపకారం

## 7

పరదేశిని ఓడించిన వాళ్ళనే పెళ్ళాడతానని ప్రియంవద చెప్పిన మరసటి రోజున, జయవిజయు లిద్దరూ, పరదేశిని కుస్తీపోటీకి సవాలు చేశారు. పరదేశి, వాళ్ళతో, ''ఒకరి తర్వాత, ఒకరెందుకు? మీ యిద్దరితో ఒకేసారి కుస్తీపట్టి ఓడిస్తాను,'' అన్నాడు.

ఆ వెంటనే జయవిజయులకూ, పరదేశికీ మల్లయుద్ధం జరిగింది. పరదేశి మధ్యన నిలబడితే, జయవిజయులు, అమితోత్సాహంతో అతడికి చెరొకపక్కా నిలబడ్డారు. పరదేశి వాళ్ళ చేతుల్లో చిత్తుగా ఓడిపోయాడు!

ఇది చూసి ప్రియంవద తెల్లబోయింది. పరదేశి, జయవిజయు లిద్దర్నీ తేలికగా ఓడించగలడని, ఆమె అనుకున్నది.

''మేం ఇద్దరం, పరదేశిని చిత్తుచేశాం. మాలో ఎవర్ని పెళ్ళి చేసుకుంటావో చెప్పు!'' అన్నాడు జయుడు.

''మీ యిద్దరిలో, ఎవరు బలవంతులో తేల్చుకోండి. కావాలంటే యిందుకు, మీ పెద్దలను సంప్రతించండి,'' అన్నది ప్రియంవద.

జయవిజయులు, తమ తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి, ప్రియంవదను పెళ్ళాడాలన్న తమ కోర్కెను తెలియబరిచారు.

అప్పుడు పెద్దపెద్ద, చిన్నపెద్ద సమావేశమై, యీ విషయం గురించి చాలా సేపు మాట్లాడుకున్నారు. వాళ్ళకు తెగని సమస్య ఏమంటే—ఎంత నచ్చచెప్పినా, ప్రియంవద విషయంలో, జయవిజయులు ఒక అంగీకారానికి రావడం లేదు. ఇద్దరూ



ప్రియంవదను పెళ్ళాడాలని తహతహలాడుతున్నారు.

"నేను పెద్దవాణ్ణి. అందువల్ల, నా కొడుకు జయుడు, ప్రియంవదను పెళ్ళి చేసుకుంటాడు," అన్నాడు పెద్దపెద్ద.

"ఇంతకాలం, మనిద్దరిలో ఎవరు గొప్ప అన్న సమస్య తల ఎత్తలేదు. ఈ పెళ్ళి జరిగితే, నువ్వూ, నీ కొడుకూ, మా కుటుంబంకంటే గొప్పవాళ్ళయిపోతారు. అది నేను సహించలేను," అన్నాడు చిన్నపెద్ద.

అప్పుడు పెద్ద లిద్దరి మనసుల్లోనూ, ఒక విషయం తళుక్కుమన్నది. ఇంతకాలంగా తామిద్దరూ ఎంతో సఖ్యంగా వుంటున్నారు. ఇప్పుడు ప్రియంవద గురించి, తమ కుటుంబాల మధ్య కలత వచ్చేలా వున్నది. ఇందువల్ల నష్టపోయే దెవరు ?

ఇదంతా, తమ యిద్దరి మధ్యా కలతలు తేవడానికి, పరదేశి పన్నుతున్న పన్నాగం కాదుగదా—అని వాళ్ళకు అనుమానం వచ్చింది.

ఆ వెంటనే పెద్ద లిద్దరూ, పరదేశి దగ్గిరకు వెళ్ళారు. పరదేశి, వాళ్ళు చెప్పింది విని, "ఈ గొడవంతా, ఆ ప్రియంవద మూలంగా వచ్చింది. ఆమె, జయవిజయులకు పోటీ పెట్టింది. అందువల్లనే, మీ మధ్య కలతలు ప్రారంభమయాయి. ఇందులో, నా ప్రమేయం ఏమీ లేదు," అన్నాడు.

ఈ జవాబు విని, పెద్దపెద్ద కోపంగా, "ఈ జరిగినదానిలో ప్రియంవద తప్పేమీ లేదు. నువ్వు, జయవిజయు లిద్దర్నీ ఓడించగలవు. అయినా, కావాలని ఓడిపోయావు. ఆ విధంగా, వాళ్ళిద్దరూ కలహించుకోవాలని పథకం వేశావు." అన్నాడు.

పరదేశి చెవులు మూసుకుని, "వాళ్ళిద్దరి సఖ్యతకోసం ప్రాణాలైనా యివ్వగల నేను, వాళ్ళ మధ్య కలతలు సృష్టించడమా ?" అన్నాడు.

''అయితే, మాపిల్లలచేతుల్లో నువ్వెందుకోడినట్టు?'' అని అడిగాడు చిన్నపెద్ద.

''నేను కావాలని ఓడిపోలేదు. వాళ్ళే ఓడించారు,'' అన్నాడు పరదేశి.

''అదెలా సాధ్యం! నీ శక్తులన్నీ ఏమయ్యాయి?'' అని అడిగాడు పెద్దపెద్ద.

''ఇప్పుడు నాలో ఏ శక్తులూ లేవు; అన్నీ పోయాయి. ఇందుకూ ప్రియంవదే కారణం. ఆమె గ్రామంలో అడుగు పెడుతూనే, నన్ను ప్రేమిస్తున్నానన్నది. ఆ క్షణంనుంచీ, నాకామెను పెళ్ళాడాలనిపించింది. ఆ స్వార్థచింతనవల్ల, నా శక్తులన్నీ పోయాయి. అపకారికి కూడా ఉపకారం చేయాలన్న మంచి బుద్ధి వుండడంవల్ల, భగవంతుడు సదా నన్ను కాపాడుతూవచ్చాడు. కాని, ఇప్పుడు నాలో స్వార్థం తలఎత్తింది. త్యాగబుద్ధి నశించింది. మీరు అనుమతిస్తే, నేనూ, ప్రియంవదా యీ గ్రామం వదిలి వెళ్ళిపోతాం,'' అన్నాడు పరదేశి.

ఈ జవాబుకు పెద్దలిద్దరూ తెల్లబోయారు.

''నువ్వు చెబుతున్నది నిజమేనా? అపకారికూడా ఉపకారం చేయాలన్న మంచిబుద్ధి వుంటే, మాకూ యిలాంటి అద్భుత శక్తులు వస్తాయా?'' అన్నాడు చిన్నపెద్ద.



''మనస్ఫూర్తిగా అపకారికి ఉపకారం చేస్తే, అద్భుతశక్తులు, ఆ మనిషిని కాపాడుతూ వుంటాయి. శక్తులు స్వప్రయోజనానికి ఉపయోగపడవు. నాకిప్పుడు నశించినట్టే, ఆ శక్తులు నశించిపోతాయి,'' అని చెప్పాడు పరదేశి.

అప్పుడు పెద్దలిద్దరూ, పరదేశికినమస్కరించి, ''అయ్యా, వయసులో చిన్నవాడివైనా, బుద్ధిలో మాకంటెగొప్పవాడివి. ఇంతకాలం మేము అజ్ఞానంవల్ల ఎన్నో దుర్మార్గాలు చేశాము. ఇకనుంచి గ్రామస్థుల బాగుకోసం పాటుబడతాం,'' అన్నారు.

''మీలో మంచి మార్పు రావడంకన్న, కావలసిందేముంది! నేనిక్కడికి వచ్చిన



పని ముగిసినట్టే. మీరు దయతలిస్తే, నేను ప్రియంవదతో పాటు గ్రామం వదిలి పోతాను,'' అన్నాడు పరదేశి.

పరదేశి గ్రామం వదిలిపోవడమే మంచి దని పెద్దలిద్దరికీ అనిపించింది. వాళ్ళు ఇళ్ళకు తిరిగివచ్చి, జయవిజయులతో, ''ఆ పరదేశిలో, ప్రియంవదను వివాహ మాడాలనే స్వార్థ బుద్ధి కలగగానే, అతడి కున్న శక్తులన్నీ నశించాయి. ఇక మీరు ప్రియంవదను మరిచిపొండి,'' అని చెప్పారు.

''అది సాధ్యమయ్యే పని కాదు. ఏది ఏమైనాసరే ప్రియంవద మాకు కావాలి,'' అన్నాడు జయుడు.

''అదెలా సాధ్యం! మీరు ఇద్దరూ ఆమె కోసంగొడవపడుతున్నారుగదా,'' అన్నాడు పెద్దపెద్ద.

''ఇప్పుడా గొడవేం లేదు. పూర్వ కాలంలో, ఒకే స్త్రీని నలుగురైదుగురు వివాహమాడినట్టు కథలున్నవి. అదే విధంగా, నేనూ జయుడూ ప్రియంవదను వివాహం ఆడతాం,'' అన్నాడు విజయుడు.

ఇది విని పెద్దలిద్దరూ ఆశ్చర్యపోయారు. తర్వాత వాళ్ళు, జయవిజయులతో, ''మీరు మరీ మొండికెత్తుతున్నారు. ఇక మిమ్మల్ని సహించం. ప్రియంవదకూ, పరదేశికీ వివాహం జరిపించి, ఈ గ్రామాన్నుంచి పంపేస్తాం,'' అన్నారు.

అందుకు జయుడు ''మీరలా చేస్తూంటే, చూస్తూ ఊరుకునేందుకు మేమేం చవటలం కాదు. మీరిద్దరూ ముసలివాళ్ళయి పోయారు. మూలకూర్చోండి. ఇల్లు కదిలారా, కాళ్ళు విరగ్గొడతాం. ఈ రోజు నుంచి మేమే గ్రామపెద్దలం!'' అన్నాడు.

''అంతే! మేమే పెద్దలం,'' అన్నాడు విజయుడు.

ఆ క్షణంనుంచీ గ్రామ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. జయవిజయులు ప్రియం వదనూ, తమ తల్లిదండ్రులనూ, ఇల్లు కదలకుండా కట్టడిచేశారు. గ్రామంలో వాళ్ళ అగడాలు కూడా మితిమీరాయి.

పరదేశి వాళ్ళవద్దకు వెళ్ళి, "మీరంటే యిష్టంలేని స్త్రీని చెరబడుతున్నారు. ఇది న్యాయంకాదు. కని పెంచిన తలిదండ్రుల్ని బాధించకండి," అని హితవు చెప్పాడు.

ఇందుకు జయవిజయులు, "మాకు నీతులు నేర్ప చూస్తున్నావా? నిన్ను ఏమీ చేయకుండా వదిలిపెట్టాం. అది నీ అదృష్టం. వారంరోజుల్లో, గ్రామం వదిలి పెట్టకపోయావంటే, నీ ప్రాణాలు దక్కవు!" అన్నారు.

పరదేశి అక్కడినుంచి బయలుదేరి, గ్రామస్థులతో, "మీ గ్రామ పెద్దలు జయవిజయులకు బందీలైపోయారు. వాళ్ళను రక్షించుకోవడం, మీ బాధ్యత కాదా!" అని చెప్పిచూశాడు.

ఈ మాటలు విన్న గ్రామస్థులు, "వాళ్ళిద్దరూ విష్ణుమూర్తి ద్వారపాలకులైన జయవిజయులు. ముని శాపంవల్లనూ, కలిపురుషుడి కోరికమీదనూ, వాళ్ళు రాక్షస బుద్ధితో యిక్కడ జన్మించారు. ఇదంతా మా కర్మ!" అన్నారు.

"జయవిజయుల బారినుంచి రక్షించుకునేందుకు, మీకు పెద్దలే ఉపాయమూ చెప్పలేదా?" అని అడిగాడు పరదేశి.

"ఆ శ్రీ మహావిష్ణువే అవతరించి, వాళ్ళ ఆగడాలను అరికడతాడని పెద్దలు చెప్పారు," అన్నాడొక గ్రామస్థుడు.

"నేనే శ్రీ మహావిష్ణువును! రామాయణ కాలమందలి వానరుల అంశ మీలో వున్నది. ప్రియంవద లక్ష్మి. ఆమెను జయవిజయులు చెరబట్టారు. మనమంతా కలిసి ఎదిరిస్తే, ఎటువంటి రక్తపాతం లేకుండా, జయవిజయులు లొంగిపోతారు. వాళ్ళ దుర్మార్గాలనుంచి, మీకు విముక్తి లభిస్తుంది," అన్నాడు పరదేశి.

"నువ్వు శ్రీ మహావిష్ణువే అని నమ్మకమేమిటి? మా పెద్దలు చెప్పందే, ఏ విషయమూ మేము నమ్మము," అన్నారు గ్రామస్థులు.

"అలాగా, అయితే మీరందరూ నా వెంట వచ్చి, ఆ పెద్దలనే అడగండి," అంటూ పరదేశి బయల్దేరాడు. —(ఇంకావుంది)





# అపకారానికి ఉపకారం

## 8

పరదేశి, గ్రామస్థులను వెంటబెట్టుకుని గ్రామ పెద్దల వద్దకు బయలుదేరాడు. అంతమంది జనంతో వచ్చిన పరదేశిని చూసి, జయవిజయులు భయపడ్డారు.

''మేమంతా ఒకసారి, మా పెద్దల్ని చూడాలి!'' అన్నారు గ్రామస్థులు ఏకకంఠంగా.

"ఎందుకు?" అని అడిగాడు జయుడు.

''ఈ పరదేశి తాను మహావిష్ణువునంటున్నాడు. అదెంతవరకు నిజమో, పెద్దల్నడిగి తెలుసుకోవాలి. పెద్దలు నిజంగా యీయన మహావిష్ణువే అంటే, మేమంతా కలిసి ఇప్పుడే మిమ్మల్ని హతమారుస్తాం,'' అన్నారు గ్రామస్థులు.

జయవిజయులు భయకంపితులై పోతూ, లోపలికి వెళ్ళి, పెద్దలిద్దరికీ సంగతి చెప్పి, ''మీరిప్పుడు మాకు సాయపడాలి. ఆ పరదేశి మహావిష్ణువని చెప్పారో, మేము మీ కళ్ళ ఎదుటే ఆత్మహత్య చేసుకుంటాం,'' అన్నారు.

పెద్దలిద్దరూ ఏం చేయాలో తోచక ఒక్కక్షణం తికమకపడి కాసేపు ఊరుకుని, ''మీరు మమ్మల్ని చాలా చిక్కు సమస్యలో పడేశారు. ఒకసారి మమ్మల్ని ప్రియంవదతో మాట్లాడనివ్వండి,'' అన్నారు.

జయవిజయులు, పెద్దలిద్దర్ని దాపులనున్న ఒక ఇంటికి తీసుకుపోయి, అక్కడ వున్న ఒక గది తలుపు తెరిచారు. గది అంతా చిమ్మచీకటిగా ఉన్నది. ఒక చాప మీద దుఃఖిస్తూ ప్రియంవద కూర్చుని వున్నది.

పెద్దలిద్దరూ ఎంతో విచారంగా గది లోపలికి వెళ్ళారు. ప్రియంవద ఒకసారి తల ఎత్తి వాళ్ళను చూసి తలదించు కున్నది. అప్పుడామె ముఖం చూసిన పెద్ద లిద్దరికీ చాలా బాధకలిగింది.

''అమ్మా, ప్రియంవదా, మా కారణంగా నీకు ఎక్కడలేని కష్టాలూ దాపురించాయి. నీ దుఃఖం మేము చూడలేము. మా బిడ్డల ప్రాణాలు పోయినా సరే, నిన్ను రక్షించు కుంటాము,'' అన్నారు పెద్ద లిద్దరూ.

ప్రియంవద ఏమీ మాట్లాడలేదు.

పెద్దలిద్దరూ, ఆమెకు జరిగినదంతా చెప్పి, ''జయవిజయులు చాలా మొండి వాళ్ళు. అన్నంత పనీ వాళ్ళు చేయగలరు. అయినా సరే, నీక్షేమం కోరి, ఆ పరదేశి మహావిష్ణువే అని చెప్పదలిచాం,'' అన్నారు.

''అయితే, నాదగ్గిరకెందుకొచ్చారు?'' అని అడిగింది ప్రియంవద విసుగ్గా.

''నీ రూపం, గుణగణాలూ చూస్తుంటే, నువ్వు దేవతవే అనిపిస్తున్నది. నీలో చాలా అద్భుత శక్తులున్నాయి. నువ్వు తలుచుకుంటే, జయవిజయుల్ని హత మార్చగలవు. కాని, నువ్వు మా బిడ్డల్ని, మా చేతనే చంపించాలని సంకల్పించావు. ఈ కడుపుకోత భరించలేము. మా బిడ్డలు మూర్ఖులైతే, వాళ్ళనుంచి ఆ మూర్ఖత్వాన్ని తొలగించు. అంతేకాని, వాళ్ళ ప్రాణాలే తీయాలనుకోకు,'' అన్నాడు చిన్నపెద్ద దీనంగా.



''మీ పిల్లల మూర్ఖత్వానికి పాలుపోసి పెంచింది, మీరు. చిన్నతనంలో, మీరు వాళ్ళను అదుపుచేసి వుండవలసింది. మొక్కై వంగనిది, మానై వంగదుకదా!'' అన్నది ప్రియంవద.

''ఈ సామెతలు, మాబోటి సామాన్యులకు కాని, నీబోటి దేవతలకు కాదు. నువ్వు తలచుకుంటే, మా బిడ్డల ప్రాణాలు పోకుండా, నువ్వు పరదేశిని పెళ్ళి చేసుకునే ఉపాయం చెప్పగలవు.'' అన్నాడు చిన్నపెద్ద మళ్ళీ.

ప్రియంవద, "నేనే ఉపాయమూ చెప్పకపోతే, మీరేం చేస్తారు?'' అని అడిగింది.

''ఆ పరదేశి శ్రీ మహావిష్ణువు అవతారం అని, గ్రామస్థులకు చెప్పేస్తాం. మేము యిలా చెప్పగానే, మా బిడ్డలు విషం తాగి ప్రాణాలు తీసుకుంటారు.'' అన్నాడు పెద్దపెద్ద.

''మీ బిడ్డల ప్రాణాలకే ప్రమాదమూ లేదు. అందుకు, నేనొక ఉపాయం ఆలోచించాను.'' అన్నది ప్రియంవద.

ఆమె, వాళ్ళకు ఆ ఉపాయమేదో వివరించింది. పెద్దలిద్దరూ శ్రద్ధగా విని, గదినుంచి బయటికి వచ్చారు.

ఇంటిముందు గ్రామస్థులందరూ ఎదురుగా కూర్చుని వున్నారు. వాళ్ళ మధ్య పరదేశి కూడా వున్నాడు. పెద్దలు, తను అవతారపురుషుడు కాదంటే, గ్రామస్థులు తననేం చేస్తారో అని, అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.





జయవిజయులు జనానికి ఒక పక్కగా కూర్చుని, తమ తండ్రులు ఏం చెప్ప బోతున్నారో వినేందుకు ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు. ఇద్దరి చేతుల్లోనూ విషం పొట్లాలున్నవి.

పెద్దపెద్ద గొంతు సవరించుకుని, "నా గ్రామస్థులారా! మన గ్రామానికి వచ్చి, మనకెంతో సాయపడినపరదేశిలో, అవతార పురుషుడి లక్షణాలు చాలా వున్నవి కాని, అంతమాత్రాన అతణ్ణి, అవతారపురుషు డనలేం. అతడు తన మహిమలు రుజువు చేసుకోవాలి. అందుకొక చక్కని ఏర్పాటు చెబుతాను," అని, ఆ దేమిటో వారికి వివరించాడు.

సమీపారణ్యంలోనికి పరదేశినీ, ప్రియంవదనూ తీసుకుపోవాలి. వాళ్ళిద్దరూ వున్న చోటుకు వెయ్యి గజాల దూరంలో, గ్రామస్థులందరూ చుట్టూ కాపలాగా వుంటారు. వంద అంకెలు లెక్కపెట్టే లోగా, పరదేశి, ప్రియంవదతో సహా మాయం కావాలి. అలా మాయం కాలేని పక్షంలో, ప్రియంవద జయవిజయులను పెళ్ళి చేసుకుంటుంది. పరదేశి గ్రామం వదిలిపోతాడు.

ఈ ఏర్పాటు గ్రామస్థులందరికీ బాగా నచ్చింది. చుట్టూ వేయి గజాలదూరంలో మనుషులు కాపలా వుండగా, పరదేశీ, ప్రియంవదా ఎలా తప్పించుకుపోగలరు? అదీ వంద అంకెలు లెక్కపెట్టేలోగా!

ప్రియంవద మాకు భార్య కాక తప్పదు; పరదేశి గ్రామం విడిచిపోకనూ తప్పదు— అనుకుని జయవిజయులు చాలా సంతో షించారు. అయితే, ప్రియంవద తను వచ్చిన చెట్టుతొెర్రలోని మార్గం ద్వారా, తిరిగి రాజభవనంచేరుకోవాలనుకుంటున్న దని, వాళ్ళకు తెలియదు!

ఆ తర్వాత పెద్దలిద్దరూ చెప్పినవిధంగా ఏర్పాట్లు జరిగాయి.

"పరదేశి అవతారపురుషుడని, నాకు తెలును. మేమిద్దరమూ యిక్కడి నుంచి మాయమై, కొంతకాలం ఆకాశయానం

చేస్తాము. అక్కడ మీ ఆతిథ్యం గుర్తు చేసుకునేందుకు వీలుగా. మాకు కొన్ని ఆహారపదార్థాలు యివ్వండి,'' అని ప్రియంవద గ్రామస్థులను కోరింది.

గ్రామస్థులు, అదే విధంగా ప్రియంవదకూ, పరదేశికీ కొన్ని ఆహారపదార్థాలు మూటకట్టి యిచ్చారు.

అరణ్య మధ్యంలో, ప్రియంవద కోరిన చోట, ఆమెనూ, పరదేశినీ వదిలారు. గ్రామస్థులు, వాళ్ళకు కాపలా కాసేందుకు వెయ్యి గజాలదూరంలో నిలబడేందుకు బయలుదేరుతూండగా, పరదేశి వాళ్ళతో యిలా అన్నాడు:

''మీరిప్పుడు వెయ్యి గజాల దూరం వెళ్ళి, వంద అంకెలు లెక్కబెడతారు. ఆ తర్వాత మేమిద్దరమూ, మీకు కనిపించం. అంటే, నేను విష్ణు అవతారమే కదా! మళ్ళీ మీకు కనబడను కాబట్టి, నా ఆదేశం చెబుతున్నాను. ప్రజాబలం, ప్రభుబలం కంటే గొప్పది. ఎవరు మీకు అన్యాయం తలపెట్టినా సహించకండి. అంతా ఏకమై, ఆ అన్యాయాన్ని ఎదిరించండి. జయవిజయులు, మీకంటే శక్తిమంతులు కారు. వాళ్ళలో వున్న జయవిజయుల రాక్షసాంశను, నేను తీసుకుపోతున్నాను. వాళ్ళను, మీ శక్తితో లొంగదీయండి. ఇంతకాలం మిమ్మల్నేలిన, మీ గ్రామ పెద్దలిద్దరూ, అన్ని విషయాల్లోనూ, మీకు సాయపడతారు. వెళ్ళండి, మీకు శుభం కలుగుతుంది!''

గ్రామస్థులందరూ వెళ్ళిపోయారు. పరదేశి, ప్రియంవదా మాయం కావాలని గ్రామ పెద్దలిద్దరూ కోరుకున్నారు. వాళ్ళు మాయం కావడం అసాధ్యమని జయవిజయులు అనుకున్నారు.

గ్రామస్థులు కనుమరుగు కాగానే, ప్రియంవద పరదేశిని, తిన్నగా సొరంగద్వారం వున్న చెట్టు దగ్గిరకు తీసుకుపోయింది. ఇద్దరూ కలిసి చెట్టుతొడెలో వున్న ద్వారం తలుపు తెరిచి, సొరంగంలో ప్రవేశించి, తలుపుకు లోపలినుంచి గడియ బిగించారు.—(ముగింపు వచ్చే సంచికలో)





# అపకారికి ఉపకారం

9

పరదేశీ, ప్రియంవదా చెట్టుతొడెలో వున్న సొరంగంలో ప్రవేశించి లోపల గడియ బిగించిన కొద్దిసేపు తర్వాత, గ్రామస్థులు వచ్చి చూస్తే, ఎక్కడా పరదేశీ, ప్రియంవదల జాడలేదు. వాళ్ళు, ఆ ప్రాంతాలగల చెట్లనూ, పుట్లనూ వెతికి, చివరకు, "పరదేశి మరెవరో కాదు, భగవంతుడి అంశగల మహానుభావుడు!" అన్న నిర్ణయానికి వచ్చారు.

జరిగిన వింతచూసి, జయవిజయులు యిప్పుడేమి చేయడమా అని, ఆలోచిస్తున్నంతలో, గ్రామప్రజలు మూక ఉమ్మడిగా వాళ్ళ మీద దాడిచేసి, నాటినుంచి పది సంవత్సరాలవరకూ, శతనందన గ్రామ ప్రాంతాల ఎక్కడ కనిపించినా, ప్రాణాలు దక్కవని చెప్పి, తరిమివేశారు.

సొరంగమార్గంలో ప్రవేశించిన ప్రియంవదకు, యీసారి ప్రయాణం యిబ్బంది అనిపించలేదు. తోడుగా పరదేశి వున్నాడు; ఆకలయినప్పుడు తినడానికి ఆహార పదార్థాలున్నాయి.

"మనం రాజభవనానికి వెళ్ళగానే, ఏం చేయాలి?" అని పరదేశి, ప్రియంవదను అడిగాడు.

అందుకు ప్రియంవద, "ఈసరికి, నన్నొక మహామాంత్రికుడు ఎత్తుకుపోయాడని రాజధానిలో పుకారు లేచి వుంటుంది. ఆ మాంత్రికుడి బారినుంచి, నువ్వు రక్షించావని, నా తండ్రికి చెబుతాను. మన వివాహం జరిగిపోతుంది," అన్నది.

"కాని, యిది అన్యాయం. ఇదేవిధంగా వివాహం చేసుకుంటానని, లోగడ నువ్వు



కాపలాభటుడు జయుడికి మాట యిచ్చి వున్నావు.'' అన్నాడు పరదేశి.

''నిన్ను చూసేవరకూ, అలాగే అనుకున్నాను. ఆ భటుడు, నా ప్రాణాలు కాపాడినందుకు, ఏమైనా చేయాలనిపించిందే తప్ప, వాణ్ణి నేను ప్రేమించలేదు.'' అన్నది ప్రియంవద.

పరదేశి కొంచెంసేపు ఆలోచించి, ''నువ్వు, ఆ భటుణ్ణి పెళ్ళాడడమే న్యాయంఅనిపించుకుంటుంది,'' అన్నాడు.

ఈ మాటలు ప్రియంవదకు చాలా బాధ కలిగించాయి. ఆమె ఎంతో విచారంగా, ''నన్ను పెళ్ళాడడం, నీ కిష్టం లేదా ?'' అని అడిగింది.

''ఎందు కిష్టం లేదు ? నీ జాతకంలో, సామాన్యుడిని పెళ్ళాడతావని వున్న దన్నావు. ఆ వెంటనే, నీకోసం సామాన్యుణ్ణి కావాలన్న కోరిక నాలో కలిగింది. ఈ స్వార్థచింతనవల్ల, అప్పటివరకూ నాలో వున్న అద్భుతశక్తులన్నీ అదృశ్యమై పోయాయి. అపకారికైనా ఉపకారం చేయమనీ, ఏ పరిస్థితుల్లోనూ స్వార్థచింతన కూడదనీ—హిమాలయాల్లో తపస్సు చేసుకునే, నా గురువర్యులు నన్నాజ్ఞాపించారు. వారి ఆజ్ఞకు వ్యతిరేకంగా ప్రవర్తించాను,'' అని పరదేశి కొంచెం ఆగి, ''ఏది ఏమైనా, నా కారణంగా జయుడికి అన్యాయం జరక్కూడదు,'' అన్నాడు.

ప్రియంవద అతడికేమీ జవాబివ్వలేక పోయింది. తను రాజభవనం చేరక, జయుడిని పిలిపించి, సంగతి చెప్పి, అతడి చేత తను పరదేశిని వివాహమాడేందుకు ఒప్పించాలనుకున్నది. ఇది జరిగితేతప్ప, పరదేశి తనను వివాహమాడడు.

కొంతకాలం గడిచాక, ఒక రాత్రివేళ, తన శయనాగారం చేరింది ప్రియంవద. ఆమె, పరదేశిని తాను పిలిచేవరకూ సారంగంలోనే వుండవలసిందిగా కోరింది.

ఆ తర్వాత, ప్రియంవద శయనాగారంలోని గంటను మోగించింది. ఆ మరుక్షణం శయనాగారంలోనికి పదిమంది



పరిచారికలు వచ్చారు. రాకుమారి ప్రియంవద తిరిగి వచ్చిందన్నవార్త, క్షణాల మీద అంతఃపురంలో అందరికీ తెలిసిపోయింది. రాజు కీర్తిసేనుడూ, రాణి కాంతిమతీ పరుగు, పరుగున అక్కడికి వచ్చారు.

కాంతిమతి, ప్రియంవదను కౌగలించుకుని, "నా బంగారుతల్లీ! ఇంతకాలం ఏమయ్యావు? ఎక్కడున్నావు?" అని అడిగింది.

"అమ్మా, అదంతా ఒక పెద్ద కథ. తర్వాత చెబుతాను. ముందు, నా అంతఃపుర కాపలా భటులందర్నీ పిలిపించండి," అన్నది ప్రియంవద.

అలా కాపలా వుండే భటులు ఇరవై మంది. వాళ్ళు అంతఃపురం బయటా, ఉద్యానవనాల్లోనూ వుంటూ, రాకుమారిని వెయ్యి కళ్ళతో కాపాడుతూంటారు.

తన కుమార్తె, ఏదో ప్రత్యేకమైన కారణం వుండడం వల్లనే, కాపలాభటులను పిలిపించమంటున్నదని, రాజు కీర్తిసేనుడు, వాళ్ళకోసం కబురు పంపాడు. త్వరలోనే కాపలావాళ్ళు అక్కడికి వచ్చారు. కాని, వాళ్ళలో జయుడు లేడు!

ప్రియంవద ఆశ్చర్యపోయి, తండ్రితో, "నాన్నా, ఈ కాపలాభటుల్లో జయుడనే వాడుండాలి. ఏమయాడు?" అని అడిగింది.

అందుకు జవాబుగా కాపలాభటుల నాయకుడు, "యువరాణీ! ఆ జయుడికి, తన మరదలితో వివాహ నిశ్చితార్థం జరగనున్నది. ఆ పని మీద వాడు నాలుగు రోజులు సెలవు తీసుకుని సొంతగ్రామానికి వెళ్లాడు. రేపు వాడు తిరిగి పనిలో ప్రవేశించవలసిన దినం," అని జవాబు చెప్పాడు.

అది విని ప్రియంవదకు పట్టరాని సంతోషం కలిగింది. ఆమె పెద్దగా ఆవులించి, "నాకు నిద్ర ముంచుకువస్తున్నది. విశ్రాంతి కావాలి," అన్నది.

ఆ వెంటనే అక్కడి నుంచి అందరూ వెళ్ళిపోయారు. ఆమె సారంగంలో దాగి వున్న పరదేశిని పిలిచి, జరిగినదంతా



చెప్పి, ''ఇప్పుడు నన్ను పెళ్ళాడటం, నీకిష్టమే గదా?'' అని ప్రశ్నించింది.

''జయుడి వివాహం, అతడి యిష్టం మీద జరుగుతున్నదో, లేదో తెలియాలికదా. మన వివాహానికి, అతడు మనస్ఫూర్తిగా అంగీకరించాలి,'' అన్నాడు పరదేశి.

ప్రియంవద, పరదేశిని సారంగంలోకి పంపింది. మర్నాడు జయుడు ఉద్యానంలో వుండవలసిందిగా, రాజాజ్ఞ అయింది.

ప్రియంవద అక్కడికి పోయి, జరిగిన సంగతులేవీ జయుడికి చెప్పకుండా, ''క్షేమంగా వున్నావా? నీ పెళ్ళికి నిశ్చితార్థం జరిగిపోయిందట, నిజమేనా?'' అని అడిగింది.

''నిజమే, రాకుమారీ! తమరు నన్ను క్షమించాలి. అనాడు—అనాలోచితంగా ఏదో కోరాను. ఎంతో కాలంగా, నా మరదల్ని వివాహమాడాలనుకుంటున్నాను. నిశ్చితార్థంతోపాటు, పెళ్ళిముహూర్తం కూడా నిర్ణయించారు,'' అన్నాడు జయుడు.

జయుణ్ణి పంపివేసి, ప్రియంవద సారంగంలో వున్న పరదేశిని కలుసుకుని, అతడికి జయుడి నిర్ణయం చెప్పి, ''ఇప్పుడు నన్ను వివాహమాడేందుకు, ఎలాంటి అభ్యంతరం లేదు గదా!'' అన్నది.

పరదేశి, ప్రియంవదను వివాహమాడేందుకు అంగీకరించాడు. అప్పుడామె, అతణ్ణి తల్లిదండ్రులవద్దకు తీసుకుపోయి, తాను సారంగమార్గం చివరివరకూ చూడగోరి వెళ్ళానని అబద్ధం చెప్పి—ఆ తర్వాత జరిగినదంతా కథగా చెప్పింది.

కీర్తిసేనుడు, పరదేశి తన కుమార్తెకు చేసిన సహాయానికి సంతోషించి, ''నా కుమార్తె కోసం, నీ అద్భుతశక్తు లన్నిటినీ త్యాగం చేసి, సామాన్యుడివై పోయావు. నీకు, నా రాజ్యాన్ని కానుకగా యిచ్చినా, నీలా కలిగిన లోటు తీరదు,'' అన్నాడు.

ఆ మాటలకు పరదేశి మందహాసంచేసి, ''మహాప్రభూ, అపకారికి కూడా ఉపకారం చేసిన పుణ్యఫలమే, నాకు

రాజ్యంతోపాటు, రాకుమారి కూడా లభ్య మయేలా చేసిందనుకుంటాను! నేను రాజునయాక కూడా, నా స్వప్రయోజనం కాక, ప్రజల మేలే ముఖ్యమని భావించి, అందుకు తగిన విధంగా ప్రవర్తిస్తాను. వాళ్ళ కోసం ఎటువంటి త్యాగమైనా చేస్తాను. ఇందుకు మీరు అనుమతించాలి," అన్నాడు.

కీర్తిసేనుడు కొద్దిసేపు ఆలోచించి, "రాజైనవాడు, ప్రజల యోగక్షేమాలే ముఖ్యమన్న ధోరణిలో పరిపాలన సాగించాలన్నది, నా అభిమతం కూడా. నువ్వు త్రికరణశుద్ధిగా ప్రజలకు మేలు కలిగించాలనుకుంటే, అందుకు అనుమతించనన్న అనుమానం నీకెందుకు కలిగింది?" అని ప్రశ్నించాడు.

"మీ పాలనలో శతనందనగ్రామం లాటి దొకటున్నది. ఏ రాజ్యంలో అయినా ప్రజలు మూర్ఖులుగా వుంటే, దాని పాలకుడు, తన విధిని సరిగా నిర్వహించడం లేదని గ్రహించవచ్చు," అన్నాడు పరదేశి.

"నువ్వు, నా కుమార్తెను వివాహం ఆడి రాజువు కాబోతున్నావు. రాజ్యంలో శతనందన గ్రామాల లాటివి మరెన్ని వున్నవో తెలుసుకుని, ఆ ప్రజల మూర్ఖత్వాన్ని పోగొట్టి, విద్యావంతులను చెయ్యి. నేను చాలా సంతోషిస్తాను," అన్నాడు కీర్తిసేనుడు.

పరదేశి, తనను వివాహం చేసుకోవడానికి అంగీకరించడంలో వున్న, కారణం, అప్పుడు ప్రియంవదకు అర్థమైంది. విశాలదేశ ప్రజలను, ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దాలని, పరదేశి ఆశిస్తున్నాడు.

ప్రియంవద, పరదేశి పాదాలముందు మోకరిల్లి, "నువ్వు సామాన్యుడివి కాదు! ముందు తరాలకు, నీ పరిపాలన ఆదర్శప్రాయమవుతుంది," అన్నది.

ఆ తర్వాత పరదేశి, ప్రియంవదను వివాహం చేసుకుని, ఉపకారసేనుడన్న పేరుతో, విశాలదేశాన్ని ప్రజారంజకంగా పరిపాలించి, ఆదర్శ ప్రభువుగా పేరుగాంచాడు. —(అయిపోయింది)

